## అమ్మకమునకు సిద్ధముగా నున్నది!

ప్రఖ్యాత ఫ్రెంచి నవలాకారుడు

విక్టర్ హ్యూగో రచించిన




నవలకు పుస్తకరూపంలో తెనుగు అనువాదం

**అనువాదకులు: సూరంపూడి సీతారాం**

(ఆంధ్రపత్రిక - సచిత్ర వారపత్రిక నుండి పునర్ముద్రితం

**వెల: రూ. 1-8-0 ★ పోస్టుఖర్చులు ప్రత్యేకం.**

మీ కాపీకై నేడే వ్రాయండి.

ఆంధ్ర గ్రంథమాల, మద్రాసు - 1.

సంవత్సర చందా
రు. 12_0_0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సంపుటము 48
సంచిక 17
22-12-54

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

జయ మార్గశీర్ష బహుళ త్రయోదశి బుధవారం



మిత్రమా, కో - ఎగ్జిస్టెన్స్!

# విషయానుక్రమణిక



43వ పేజీలో బొట్టుపెట్టుకొను బొమ్మ పంపినవారు అల్లువోలు సావిత్రి (7 సం॥) — భీమవరం.

# హనోయ్ విశేషాలు: 7

## 12. వియట్నామీజ్ స్త్రీలు

### క్రొవ్విడి లక్ష్మన్న

వియట్నామ్‌లో మొగవాళ్ళకంటే ఆడవాళ్ళ జనాభా యెక్కువ. పూర్వకాలపు రోజుల్లో వియట్నామీజ్ స్త్రీలు స్కూళ్ళకీ కాలేజీలకీ వెళ్ళి చదువుకునే ఆచారంలేదు. ఆ రోజుల్లో స్త్రీలు గురుముఖతా యింటివద్దనే చదువు చెప్పుకునేవారు. వాళ్లు నేర్చుకునేది చైనాలిటరేచరూ, వియట్నామీజ్ లిటరేచరున్నూ.

రానురాను ఫ్రెంచివారి నాగరికతా ప్రాబల్యంమూలాన్న వియట్నామ్‌లో స్కూళ్ళూ కాలేజీలూ కూడా వెలిసేయి. (ఇండో చైనా యూనివర్సిటీ సుమారు 50 ఏళ్ళక్రితం ఏర్పడింది.) అయితే ఆ మొదటిరోజుల్లో ప్రత్యేకించీ ఆడపిల్లలకి వాళ్ళవాళ్ళ బళ్లుఉండేవి. అంచేత మొగపిల్లలు మొగపిల్లల స్కూళ్ళకీ ఆడపిల్లలు వాళ్ళగర్ల్స్ స్కూళ్లకీ వెళుతూఉండేవారు.

కాని యిటీవల కో-ఎడ్యుకేషన్ చాలా ప్రబలింది. ప్రతీ స్కూల్లోనూ, కాలేజీలోనూ కిటకిటలాడుతూ ఉంటారు, విద్యార్థులు—ఆడా మొగానూ. ఆడవాళ్లు ముఖ్యంగా పెడగోజీ, లా, మెడిసినూ చదువుతారు. పెడగోజీకోర్సు యించుమించుగా మనవైపు (B. Ed)వి. ఇడిలాంటిది. ఇది ప్యాసయితే మాస్టరుగిరీ చెయ్యవొచ్చును. ఎక్కువమంది యీ సబ్జెక్టు తీసుకుంటారు; తరువాత ఎక్కువమంది స్త్రీలు తీసుకునే సబ్జెక్టు వైద్యం. "లా" చదువుకున్న ఆడవాళ్ళూ లేకపోలేదు గాని ప్రాక్టీసు చేస్తున్న ఆడలాయర్లుమాత్రం చాలాకొద్దిమందే— అయిదారుగురుకంటే లేరు.

పదహారూ - పద్ధెనిమిది సంవత్సరాలకి ఆడపిల్లల పెళ్ళియీడు సాధారణంగాను. అయితే ఒక్క చిన్న విశేషం ఏమిటంటే ఆడపిల్ల పెళ్ళికి సంగీతం వగైరాలు వొచ్చి ఉండాలన్న యిబ్బందిలేదు. "మీ అమ్మాయికి సంగీతం వొచ్చునా?" అన్న ప్రశ్న పెళ్ళిచూపుల్లో అసలు రానేరాదు. ఇహ పెళ్ళికూతురికి ఉండవలసిన ముఖ్యమయిన క్వాలిఫికేషన్సు ఏమిటీ అంటె — పిల్ల బాగా వొండుతుందా? కుట్టుపనీ, ఎంబ్రాయిడరీపనీ వొచ్చునా? సంసారం పొదుపుగా చేస్తుందా? యిత్యాది-వీటిలో వంట నేర్చి ఉండడం చాలముఖ్యం. గొప్పగొప్ప వాళ్ళయిళ్ళల్లో, వంట మనుష్యులు ఉన్నప్పటికీ,విందుసమయాల్లోనూ, యితరత్రా అతిథులు వొచ్చినప్పుడూ తప్పకుండా ఆడపిల్లలచేత వండించి, 'ఈకూర మాఅమ్మాయి చేసిం'దనో, 'ఆ పులుసు మా ఆవిడ కాచింద'నో గొప్పగా చెప్పుకుంటారు. అలా యింటిఆడంగులు చేసిపెట్టడం అతిథులకి ఓ మర్యాద.

స్త్రీలకి చిత్రలేఖనానికీ చాలా దూరం వియట్నాంలో.

ఇక్కడి స్త్రీలు— ముఖ్యంగా గొప్పయింటిపిల్లలు కొద్దోగొప్పో సంగీతం నేర్చుకోవడం యిటీవల పరిపాటి అయింది. చాలామంది పియానో వాయిస్తారు. మరి కొంతమంది ఫిడేలు వాయిస్తారు. కాని ఈ సంగీతం, మొత్తమ్మీదచూస్తే, మనవేపులాగ ఖచ్చితంగా నేర్చుకున్నది మాత్రం కాదు; పెళ్ళిముందర సంగీతం అసలే కాదు! సానయిటిలో మెరుగుకే!

వియట్నాంలో ఎంతోమంది, పెళ్ళి



వియట్నామీజ్ విద్యార్థినులు.

పిక్నిక్‌లో వియట్నామీజ్ పిల్లల "డాన్సు"

చేసుకోకుండా అలా ఉండిపోయిన ఆడ
వాళ్లు ఉన్నారు. ఇలాంటివాళ్లు ఊః చదు
వులతోనూ, లేదావిద్యాబోధ చేస్తూనో
కాలం గడుపుతారు. జీవితంలో ఏదో పెద్ద
ఆశాభంగంవల్లనో, లేకపోతే యితరకార
ణంవల్లనో, యింకేమీ అనుభవించతగ్గది కన
పడక, యిలాగ చదువుల్లో నిమగ్నులయి
పోయేరు వీళ్ళు.

ఆడవాళ్ళు ఆఫీసుల్లో పనిచెయ్యడం పరి
పాటి. పెళ్ళయినవాళ్ళుకూడా కచేరీల్లో
పనిచేస్తారు. ఏమీ ఎబ్బెట్టుగా ఉండదు
సంఘంలో.

మొగాళ్ళకన్నా ఆడవాళ్ళకి తెలివి
తేటలు ఎక్కువని అంటారు. ముఖ్యంగా
వర్తకంలో. అంచేతే సాధారణంగా ప్రతీ
ఆడదానికీ ఒకషాపు ఉంటుంది. పురుషులు
కచేరీల్లో ప్రాకులాడుతూ ఉంటే స్త్రీలు
యింటివద్ద షాపుల్లో వర్తకంచేస్తారు.
మొత్తంమీద ఆడదాని అర్జనే హెచ్చుగా
ఉంటుంది. కాగా, కర్చువెచ్చాలలో
ఆడది మహాగడుసు! ఇంటిపెత్తనం అంతా
ఆడదానిదే. పురుషుడు తను సంపాదించింది



స్త్రీల పటాలం, "కవాతు".

 

## హానోయ్ విశేషాలు



కాస్తా తెచ్చి స్త్రీ చేతుల్లో పెడతాడు; ఇహ మే నేజిమెంటు అంతా ఆమెదే. పురుషుడు ఎంతమాత్రం యింటి వ్యవహారాల్లోను — ముఖ్యంగా ఖర్చువెచ్చాల్లో — కలగచేసుకోడు. (పురుషులు మహద్విషయాలు ఆలోచించాలి గాని, యిల్లూ ఖర్చూ అదీయిదీ — యీ ఊబిలో పడిపోకూడదంటారు, వీళ్లు!) అలాగని ఆడది దూబరాఖర్చు చెయ్యదు సాధారణంగాను. పుట్టింటి వారికీ పెట్టెయ్యదు. ఎప్పుడయినా అటువంటి సందర్భం తటస్థించి, తనవాళ్ళకి సహాయం చెయ్యవలసినపర్థితి ఏర్పడినట్లయితే, భర్త అనుమతి తీసుకుని మరీ వ్యవహరిస్తుంది.

కాని ఒక్కొక్కప్పుడు — ముఖ్యంగా ధనికుల యిళ్ళల్లో యీ పద్ధతివల్ల ముప్పే వొస్తూ ఉంటుంది, పాపం. గొప్పవాళ్ళకి పనిలేకపోగా తీరుబాటు ఎక్కువయిపోవడం మూలాన్ని. నలుగురు ఆడవాళ్ళూ ఓ చోటచేరి జూదం ఆడతారు. ఈజూదాన్ని (*Majong*) అంటారు. ఇది యిలాఉండగా దేవుడి పేరుతోనూ, పెద్దమ్మ పేరుతోనూ వీళ్ళ దగ్గిర సొమ్ముహరించే వాళ్ళూ లేక పోలేదు. "నీకు చాలా గడ్డురోజులివి; దీనికి తగిన ప్రతిక్రియ జరిగించకపోతే సర్వనాశనం అయిపోతుంద"ని ఓ పలుకు పలుకుతాడు శకునమత్తి, పురోహితుడు - దాంతో యిల్లాలు ఊశ దుస్తులూ, నగలూ కొనడం ఆరంభిస్తుంది. తరువాత చక్కగా ముస్తాబు చేసుకుని గుడికి వెళుతుంది. అక్కడ కొంత మంది వాయిద్యగాళ్లు ఉంటారు - దేవుడి ముందు వాళ్ళు వాయిస్తూ ఉంటే యీమె నృత్యం చేస్తుంది. (శివాలేసి పట్టు చుట్టూ

తోటలో పనివాళ్లంతా జోరుగ వర్షం కురుస్తుంటే చెట్ల క్రింద కూర్చునివుంటారు.

యజమాని: యేరా పని వదలి అలా కూర్చున్నారేం. చెట్లకు నీళ్లు కట్టరుండా?

పనివారు: కుండపోతలా వానొస్తుందికదండి!

యజమాని: అయితే గొడుగులు పెట్టుకుని నీళ్లు తోడండి.

—జి. కె. మూర్తి, గద్వాల.



విగ్రహాలు చెక్కడం.

ఓకందమంది మూగి యిదంతా చూస్తూ ఉంటారు. ఆ వాయిద్యగాళ్ళకి బోలెడు సొమ్ము యివ్వాలన్న మాట అలా ఉంచగా, యీ చుట్టూ మూగిన వాళ్ళమీద సొమ్ము జల్లి పారెయ్యాలి (దిగదుడుపులాగ)! ఎంత సొమ్ము వెదజల్లితే అంత భక్తితాత్పర్యాలతో యీ ప్రక్రియ చేసినట్టు — దీనికి లెండంగ్ (*Len Dong*) అని పేరు.

ఈ దేశంలో విధవా పునర్వివాహం కొత్త కాదు; విడాకులూ కొత్త కాదు. ఎటొచ్చీ విడాకు లివ్వడం అంత తేలికయిన విషయం మాత్రం కాదు. సాధారణంగా మధ్యవర్తులు రాజీ కుదర్చడానికి ప్రయత్నిస్తారు. కోర్టు ప్రొసీడింగ్సు కయితే రెండు మూడేళ్లకి తక్కువ పట్టదు. విధి యెలాగ ఉన్నా, విడాకులు యిచ్చిన ఆడదాన్ని గాని, విధవని గాని సంఘంలో యెబ్బెట్టుగా చూడరు. వీళ్లకి తిరిగి పెళ్లిళ్ళు కూడా సులభంగానే జరుగుతాయి. అలాంటి పెళ్లిళ్లని ఎంత మాత్రం యీసడించరు, సరికదా, 'తోవలో దొరికిన పువ్వు, చెట్టున తెంపింది కాకపోయినా దొరికినవాడికి కొత్తదే' అని సంతోషిస్తారు! (ఇది వియట్నామీజ్ సామెత.)

ఫ్రెంచివారి హయాంలో పడుపువృత్తి బహు ప్రబలంగా ఉండేది. ముఖ్యంగా అమాయికపు పల్లెపడుచులు యీ దుర్వ్యాపారానికి చాలా గురి అయ్యేవారు. అయితే యిటీవల స్త్రీలలో "వేశ్యావృత్తి నిరోధన" సంఘం ఒకటి బయలుదేరి ఎక్కువగా పని చేస్తోంది.

వియట్నాం స్త్రీలు *conical* గా ఉన్న గడ్డి టోపీలు వాడతారు. లోపల బాడీసూ, దానిమీద కబ్బా, దానిమీద ముణుకులు దిగేదాకా ఉండే పొడుగాటి "జొబాయి"న్నీ, కాళ్ళకి పంట్లాలు తొడుక్కుంటారు. వీటికి జేబులుండవ్. నడుందగ్గర "ఎలాస్టిక్ బేండు" ఉంటుంది. కొద్దిమంది, నేటి చైనాలోలాగ, పాశ్చాత్య దేశపు దుస్తులు వేసుకునేవాళ్ళూ లేకపోలేదు, అక్కడక్కడ. వీళ్లందరికీ సర్వసాధారణంగా ముణుకులవరకూ వేలాడుతూ ఉంటుంది జుట్టు. కాని, ఏ కొద్దిమందో తప్ప జడ వేసుకోరు. మామూలుగా కిందకి దువ్వుకుని, మధ్యన ఓ "క్లిప్పు" తగిలిస్తారు. చాలామంది *Bobbed hair* ఉన్నవాళ్ళూ ఉన్నారు. కాని యెవ్వరూ తల్లో పువ్వులు మాత్రం పెట్టుకోరు. జోడు లేకుండా ఆడది కాలు నేల మోపదు. ఇంట్లో పాంకోళ్లు వాడతారు.

ఆడవాళ్లు నిరభ్యంతరంగా మాంసం తింటారు.

మొగవాళ్ళకంటె ఆడవాళ్లు (ముఖ్యంగా పల్లెటూరివాళ్ళూ, ముసలివాళ్లూను) కారాకిల్లీ వేసుకుంటారు. ఈ దేశపు తమలపాకులు పెళుసుగా, కారంగా, మన "బెంగాలీ ఆకు"ల్లాగ ఉంటాయి. వీళ్ళు వెదురు బొంగుతో చేసిన "హుక్కా" కూడా కాలుస్తారు, గొప్పయింటి ఆడవాళ్లయితే సిగరెట్లున్నూ.

పళ్ళకి "కప్పు" (నల్లటిరంగు) వేసుకోవడం అనాదినుంచీ ఆచారం. కప్పు వేసుకుంటే పళ్లు పుచ్చిపోకుండా, గట్టిగా ఉంటాయిట. ఈ ఆచారం నవయువకులలో నశించిపోయింది కాని, పల్లెటూళ్లలో యింకా ప్రబలంగానే ఉంది.

కాలం గడిచి, కష్టసుఖాలు వంటబట్టి, వీళ్ళు పైబడుతూ ఉంటే, వీళ్ళు "డిక్వ" అని ఓ నియమం పడతారు. ఈ నియమం పట్టిన ముసలాళ్ళు మాంసం తినరు. ఎంతసేపూ సాత్త్విక ఆహారం పుచ్చుకుని, కోవెలకి వెళ్ళి, ప్రార్థనలు చేస్తూనూ భక్తితాత్పర్యాలతో కాలం గడుపుతారు.

ముఖ్యంగా చెప్పవలసింది స్త్రీల ధైర్యసాహసాలు. వియట్నాం సేనల్లో మొగవాళ్లు ఎంతమందో ఆడవాళ్లు అంతమందీ ఉన్నారని లోగడ మనవి చేసేను. స్త్రీలు మిలటరీలో చేరి పురుషులతోపాటు, టేంకులూ, ఫిరంగులూ అవీ ఉపయోగించి యుద్ధం చేసేరు; చేస్తారు. గొరిల్లాయుద్ధంలో ఆరితేరిన చెయ్యి ఆడది. పురుషులతోపాటు సరసనుండి, కవాతు చేసి, కాయకష్టపడి పని చేస్తారు స్త్రీలు. ఆడా మొగా, కలిసి సరసని పని చేస్తున్నప్పుడూ, యుద్ధాల్లోనూ, కేంపుల్లోనూ కూడా ఎంతో కలిసిమెలిసి ఉంటారు. కాని ఏవిధంగానైనా సరే ఏమాత్రం హెచ్చుతగ్గు వొచ్చినా వెంటనే తుపాకితో కాల్చెయ్యాలని మిలటరీలో రూల్సుట. అందుచేత శీలానికి లోటు రాదు. మిలటరీలో పని చేస్తూన్నా, పెళ్ళి చేసుకోవాలంటే నిరభ్యంతరంగా చేసుకోవచ్చును. వియట్నాం మిలటరీలో పురుషుడంటే ఎంత విలువో స్త్రీకి అంతకన్నా ఎక్కువ తాహతూ విలువా అంటే అతిశయోక్తి కాదు!

(10-11-54 సంచికనుండీ "హానోయ్ విశేషాలు" రచిస్తున్న శ్రీ కొవ్విడి లక్ష్మన్న గారు ఇండోచైనాలో యుద్ధవిరమణ పర్యవేక్షణకుగాను వెళ్ళిన ఇంటర్నేషనల్ కమీషన్ తాలూకు సెక్రెటేరియట్‌లో ప్రస్తుతం పని చేస్తున్నారు.)

అయిపోయింది

# ద్వేష బీజం

భమిడిపాటి వెంకటరమణ

కామయ్యనాయుడే ప్రారంభించాడు రామయ్యదొర కుక్కకి విషం పెట్టడంతో-ఇద్దరు స్నేహితులు. ఇరుగు పొరుగు వాళ్లు ఇద్దరి పొలాలు ఒకదానికొకటి తగిలే ఉన్నాయి. రామయ్యదొర కుటుంబీకుడు. కొడుకు కలకత్తాలో పనిచేస్తున్నాడు. ఒక కూతుర్ని పట్నం సంబంధం చేశాడు. ఇంకొక కూతురు, భార్యా ఇంటిదగ్గరే ఉన్నారు. కామయ్యనాయుడు ఒంటరిగాడు. సామెత చెప్పినట్టూ 'స్వయం రాజా స్వయం మంత్రీ, ఇంటా బయటా పని అంతా తనే చూసుకుంటాడు. అతను పొలంపనిలో అశ్రద్ధ ఏమీ చూపకుండానే గడుపుకొస్తున్నాడు. చిన్న తోటకూడా ఉంది. ప్రతిఏడూ పక్షులు పురుగులు, కొట్టివేయగా కూడ తనకు కొంత లాభం కల్గించే పాటిదిగా ఉండేది ఆ తోట. ఒక ఆవు ఉంది. అంతే. ఇంక అతని ఇంటి తలుపులకి, ద్వారాలకి బంధులు లేవు. ఇంటి గోడలకి సున్నంకూడా లేదు. ఎప్పుడూ ఏదో ఒక మరమ్మత్తు అవసరం అవుతూనే ఉండేది. తరుచూ రామయ్యదొర ఇంటి నుండి గొడ్డలనీ సుత్తినీ కొడవలనీ, అడిగి తెచ్చుకునేవాడు. దొర స్వభావసిద్ధంగా మంచివాడు. ఏదడిగినా లేదనకుండా సంతోషంగా ఇచ్చేవాడు. ఒకమారు నాయుడు గొడ్డలికొయ్య విరిచేశాడు. గొడ్డలి తిరిగి ఇచ్చేస్తున్నప్పుడు అన్నాడు "కొత్తకొయ్య వేసిఇస్తానులే అవసరమయితే" అని. అందుకు దొర అన్నాడు "దానిమాటకేం పోనిద్దూ నాయుడు! ఆ పాతకొయ్య ఎలాగు చిల్లిఉంది. ఈసరికి కొత్తకొయ్య వేయవలసింది ఎలాగు" అని.

నాయుడు కొడవలి తెస్తాడు. కాని దానిని తిరిగి ఇచ్చేటప్పుడు దాని పళ్ళు వాడిచేసి మరీ ఇవ్వాలనే ఆలోచన ఉండదు అతనికి. కాని దొర ఎప్పుడూ అలాటి పేచీ పట్టించుకోడు. రామయ్యదొర భార్య, కూతురుకూడా మంచివాళ్ళే. ఒకమారు నాయుడికి జబ్బుచేసి మంచంపడితే రామయ్యదొర అతగాడి పొలం పని అంతా చూసేవాడు. అతని భార్యో, కూతురో నాయుడి ఇంటికివచ్చి ఇల్లు చక్కదిద్ది పోయేవారు. వచ్చేటప్పుడు ... వారో తెచ్చేవారు. ఏదో విధంగా నాయుడు రోజుకొక మారయినా ఎంగిలి పడేటట్టు చూసేవారు. మళ్ళీ మామూలుగా అతను లేచి తిరుగాడ గలిగేవరకు యథాశక్తి సహాయం చేసేవారు. కామయ్య నాయుణ్ని అడుగుతే రామయ్యదొర కుటుంబం చాలా మంచిదనే చెప్తాడు. కాని వాళ్లు చూపుతూండే నిత్యదయ, దొరకి ఉండే ఉదారస్వభావం నాయుడుగుండెల్లో ద్వేషబీజాన్ని నాటాయి. ఆ విత్తు మొలకెత్తింది.

కామయ్యనాయుడు విషం పెట్టి చంపాడు రామయ్యదొర కుక్కని. నల్లటి కుక్క ముఖంమీద తెల్లటిచుక్కతో ఊర కుక్కల జాతిదే. పక్షుల వేటలో దమ్మిడీకి పనికొచ్చేదికాదు. వేటకు బయలుదేరితే దారే తప్పేది. వేటను పట్టుకొస్తుందని నమ్మకం ఉండేదికాదు. అంత అభిమానంగా చూసుకోతగ్గ కుక్క కాదు అయితే ఏ కుక్కయినా అభిమానం ఉంటేనేగదా పెంచడం. దానికి ఇంటిగ్గర ఉన్నంతసేపూ బయటికి పోవడానికీ, బయటనున్నంత సేపూ ఇంటికి పోవడానికీ ఆత్రుత ఎక్కువ. రామయ్యదొర పెళ్లాం అది ఎప్పుడేనాపిచ్చెత్తుందేమోనని భయపడేది. ఇంకొకటి దానికెప్పుడూ ఆకలే. ఏది కంటబడ్డా తినేస్తుంది. రోజుల్లా ఊరి పెంటకుప్పల చుట్టూ తిరుగుతుంది. పెంటలమీద ఏమీ దొరక్కపోయేసరికి వంటగది గుమ్మందగ్గర దేబిరిమొహం వేసుకొని కాచుకకూచున్నది ఏవేళప్పుడయినా ఇంత ముద్దపడేస్తారా అని.

ఒక్కొక్కప్పుడు దొర, నాయుడు పక్షుల షికారికి వెళ్లేవారు. ఈకుక్కుండే (దాని పేరు చుక్క) దానిదారిని ఎటో పోయేది. అరగంటవరకు వీరికంటబడేదేకాదు. వాళ్లకి దొరికిన మంచి మంచి అవకాశాలుకూడా జారవిడుచుకోవలసి వచ్చేది. ఇలాటి సమయాల్లో నాయుడు అనేవాడు "వెధవ కుక్క. అది ఉండి ఏంలాభం?" అని. ... నాయుడు! ఇప్పుడు కాకపోతే మరొక్కప్పుడు మంచివేళ రావచ్చు!" అని వేదాంతిలాగ. దొరకి ఇప్పుడుఇలాటి సమయాల్లోనూ ఉండేఓర్పు, విరిగినగొడ్డలి, అరిగిన కొడవలి విషయంలోకూడా అతను చూపిన ఓర్మి కామయ్యనాయుడు మనస్సుని బాగా క్రోధపరచాయి. ఈక్రోధాన్ని చుక్కమీదకి మరల్చేడు. ఆ కుక్కంటే అపరిమితంగా అసహ్యించుకునేవాడు. తన తోటి ఒకటి సహాయపడింది. చుక్క నిత్యమూ శోధించేస్థలాల్లో నాయుడు వంటయిల్లు ఒకటి. నాయుడుమాత్రం దానికేనాడు పట్టెడు ముద్దపెట్టిన సాపాన పోలేదు సరికదా దయగల ఒక్కమాట అయినా అనేవాడు కాదు. బండబూతులు తిడ్తూ దాన్ని తరిమికొట్టేవాడు. కాని చుక్కమాత్రం తనపని మానేది కాదు. రోజూ ఒకమారయినా ఆ వంటఇంటి గుమ్మందగ్గరకిరాకుండా ఉండేది కాదు. తన యజమానికి స్నేహితుడుకదా తనకూ స్నేహితుడే అని దాని నమ్మకం. అది రోజూ వంటయింటికి వచ్చిపోయేదారి పెరటితోవగుండా ఉండేది. ఒకఏడు నాయుడు. మొక్కల్ని ఆ దారిలో నాటాడు చుక్కకి మొక్కలు ఉన్నా లేకున్నా ఒకటే. దాని దారిమాత్రం అది వదిలేది కాదు. దాని కాళ్ళకింద పడి పెరుగుతున్న మొక్కలు ఏం కావాలో, అది అవుతూండేవి. నాయుడు తిట్టినా రాళ్లు రువ్వినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. మొక్కలకి జరిగిన నష్టం కొద్దిపాటిదే అయినా నాయుడుకి కలిగిన కష్టం మాత్రం ఎక్కువగా ఉంది. తను చేసిన తప్పులనుగురించి ఆలోచించి చాలా మథనపడేవాడు. కాని రామయ్యదొరతో చెప్ప లేదు చెప్పినా లాభంలేదని తనకు తెలుసు. "ఓస్ ఇంతేనా! అంతమాత్రాన నీ మొక్కలకి పెద్దనష్టం ఏమీ రాదులే. ఈమాత్రం దానిగురించి ఇంత బాధపడతావెందుకయ్యా నాయుడూ?" అని అంటాడు దొర. అందువల్ల అతనికి చెప్పదలచుకోలేదు. కాని కుక్క మాత్రం తన మొక్కల్ని తగలెయ్యకుండా చూడాలి. కుక్కకి విషం పెట్టి చంపేయాలన్న ఆలోచన నాయుడు బుర్రలోకి ఇంకా పూర్తిగా వచ్చిందో లేదో ఆ రాత్రే ఒక రొట్టె ముక్కలుగా కోసి ఆ ముక్కల్లో విషం కలిపి తోటలో విరజల్లాడు. అలాగ జల్లడంలో తప్పేమీ లేదు. పందికొక్కులూ అవీ తోట పాడుచేయకుండాఉండాలంటే అలా చేస్తారు. ఏదయినా కుక్క ఆ ముక్కల్ని తిన్నదీ అంటే అది దాని తప్పే. నాయుడు ఉదయాన్నే లేచాడు

సరిగా ముక్క రానూ వచ్చింది. రొట్టెముక్కల్ని చూసింది. గబగబా గుటక వేసింది. ఒక్క ముక్క కూడా మిగల్చకుండా తినేసింది వెతికి వెతికి. అక్కడికి సంతృప్తి కాక వంటగది గుమ్మందగ్గర కాసింది ఇంకా ఏమయినా దొరుకుతుందేమోనని. కాని నాయుడు దాన్ని తరిమేశాడు. అక్కడ్నుంచి 'ముక్క' ఆ దారి వదలి ఊరికిదూరంగా చెట్లలోంచి కాలువలు దాటి సుబ్బయ్యగారి కళ్లంవేపు వెళ్ళిపోయింది. రోజూ సాధారణంగా అటే వెళ్తుంది. నాయుడు కిటికీలోంచి చూస్తున్నాడు ముక్క పోయేదారిని. చెట్లను సమీపించేలోగా 'ముక్క' ఒకసారి ఆగి కక్కుకుందికి ప్రయత్నించింది. ఆ తరువాత అది చెట్లలోకి పోయింది మరి కనిపించలేదు. ఆ తరువాత అది మరి ఎవ్వరికీ కనిపించలేదు. నాయుడు తన నాగలి తీసుకొని ముక్క ఆఖరి అడుగుజాడ కనిపించేంతవరకు చెర చేసి చక్కా, తిరిగి వచ్చేశాడు. ముక్క ఇంటికి ఆరోజు ఆ మర్నాడు రాకపోయేసరికి దానికి ఎదో స్వంగారి సంబంధమైన కారణం ఉండివుండవచ్చును, రెండు రోజులుపోయాక అదే తిరిగివస్తుంది' అనుకున్నాడు రామయ్యదొర. కొందరి కొందర్ని అడిగిచూశాడు కూడ. కాని అందువల్ల ప్రయోజనం ఏమీ లేకపోయింది. నాయుడుతో ఈమాట చెప్పాడు. నాయుడు "అయ్యో! అలాగ! నేను చూడనేలేదే ముక్కని ఈమధ్య. ఏటో స్వంతపేటమీద వెళ్ళివుంటుంది రెండురోజులు ఓపికపడ్తే అదె తిరిగొస్తుందిలే" అన్నాడు నవ్వుతూ. కాని ముక్క తిరిగిరాలేదు. అది అంత అకస్మాత్తుగా అదృశ్యం కావడం గ్రామంలో కొంతవరకు చర్చనీయాంశం అయింది. కొందరు దుప్పిని, వేటాడుతూన్న ఏ వేటగాడి గుండుకయినా బలి అయిందేమో అన్నారు. కాని అలాటిది జరిగితే ఈనాటివరకు తెలియకుండా ఉంటుందా? దారంటే పోయే ఏ లారీ డ్రయివరయినా ఎత్తుకొని పోయాడేమో! అన్నారు కొందరు. రామయ్యదొర ఆమాట నమ్మలేదు. "నేను నమ్మను. ఏ మనిషయినా కుక్కను దొంగలిస్తాడంటే అదిమాత్రం బిడ్డల్ని అపహరించడం వంటిది కాదా?" అన్నాడు.

"ఎవరేనా విషం పెట్టి చంపారేమో!" ఆమాటకూడా ఆయన నమ్మలేదు. "ఛా, ఛా! ఎంతమాట! చుట్టుపక్కల పదిమైళ్ళ దూరంలో ఉన్న అందరికీ తెలుసును 'ముక్క'. ఎవరూ దాన్ని హింసించరు." అన్నాడు. చివరకు ఆయన చేసిన నిర్ణయం ఏమిటంటే. "ముక్కకి ఏదో జబ్బుచేసింది. ఏ చెట్లలోకో పోయి, అది చచ్చి ఊరుకొని ఉంటుంది" అని.

రామయ్యదొర మాటలకు కామయ్య నాయుడు మాత్రం మోసపోలేదు. దొరకి తప్పకుండా అనుమానం కలిగిఉండాలి. కాని ఈ అనుమానం ఎన్నాళ్లు లోపల దాచుకుంటాడో ఎప్పుడు బయటపడ్తుందో అని నాయుడు లోలోపల భయపడ్తున్నాడు. రోజులు గడుస్తున్నకొద్దీ నాయుడుకి భయం బిగుసుకుంటూంది. మిగతావాళ్ళు 'ముక్క' సంగతే మరచిపోయారు. దాని ప్రసంగమే ఎప్పుడో కాని వచ్చేది కాదు. కాని నాయుడు మాత్రం మరచిపోలేదు. అతనికి దొర కనిపిస్తున్నంతకాలం. మనస్సులోని భారం తగ్గదు. ఏ మాటయితే అతని నోటివెంట ఏ క్షణాన్నయినా వినవలసి వస్తుందని తాను ఎదురుచూస్తున్నాడో ఆమాట చెవిని పడేవరకు తనకు మనశ్శాంతిలేదు. దొర తనకంటికి కనిపిస్తున్నంత కాలం, తన పొరుగున ఉన్నంత కాలం, తనమీద దయచూపుతూ ఉన్నంత కాలం నాయుడికి శాంతిలేదు.

చాలా ఏళ్ళయింది చెప్తున్నాడు. రామయ్యదొర తన పొలానికిగాని సరసమైన ధరవస్తే అమ్మేసుకొని దిగువకి పోతానని. ఇంక పొలం ప్రటా బాజరు బందీ తను పడలేనని. నాయుడికి ఈ మాటలు జ్ఞాపకానికి వచ్చి దొర ఎంతవేగంపోతే అంత బావుణ్ణు అనుకున్నాడు.

దొరగారి ఈ వదలినస్నేహం ఎప్పుడో ఒకప్పుడు తనని వలలో వేసుకోడానికె అనుకున్నాడు నాయుడు. దొర తెలివితక్కువ దద్దమ్మకాడు. అతడు రాత్రుల్లో తనఇంటిని కనిపెట్టి చూస్తున్నట్టు అనుమానంగా ఉంది. ఒకమారు దొర ఆ చెట్లదగ్గరగా తిరుగుతుండగా చూసి తను చూశాడు. అక్కడే ముక్క అదృశ్యమయింది. ఈసారి కలిసినప్పుడు అడిగాడు. "అక్కడేం చేస్తున్నావుదొరా మధ్యాహ్నం ఆవేళప్పుడు?" అని. "ఆఁ. ఏముందీ, ఆ సుబ్బయ్యగారింటికి వెళ్లాను. కోడెదూడను అమ్మజూపాడు" అన్నాడు దొర. నాయుడు ఆమాటలకి మోసపోలేదు.

వర్షాకాలం ఆరంభంరోజుల్లో నాయుడు 'ముక్క'కి విషం పెట్టాడు. ఇప్పుడు మంచి వేసవికాలం. దొరకి పూర్తిగా అనుమానం బలపడి వుంటుంది ఈసరికి. ఋజువుకోసం ఎదురుచూస్తున్నాడు అనుకున్నాడు నాయుడు. నాయుడుకి ఈ వేసవి గడవడం గడ్డుగానే వుంది. ఏక్షణాన్నయినా దెబ్బతీస్తుందేమో అన్న భయంగాఉంది. దొరను ఎక్కువగా ద్వేషించడం ప్రారంభించాడు. ఇంతా అంతా అనలేని ద్వేషం. చివరకు తానే ఎక్కువగా హింసింపబడుతున్నట్టుగా భావించుకున్నాడు. దొర ఇప్పటికీ తనభూమి అమ్మేసుకొని వెళ్ళిపోదామనే తలంపు ఉన్నట్టు చెప్తాడు. నిజానికి పొల మ్మోదవచ్చేది ఏమీ లేదు. ఈ కొంపలు చేసే పాటికూడా అది చెయ్యదు. ఈ ఆలోచనే నాయుడుబుర్రలో పదేపదే మెదులుతూ ఉంది. ఆ యిల్లేగాని కాలిపోతే, ఒకప్పుడు ప్రమాదవశాత్తు ఒక్క పిడుగుపడి ఆ గడ్డివాములు తగలబడ్డాయనుకోఅప్పుడు. తప్పకుండా దొర ఆ పొలాన్ని ఏవరికేనా గుత్తకయినా ఇచ్చేసి తన దారిని తాను చక్కాపోతాడు.

ఒక రాత్రి ఉరుములతో మెరుపులతో గాలివాన వచ్చే సూచనలు కనిస్తుపిన్నాయి. పశ్చిమ దిక్కునుంచి ప్రారంభించి గ్రామం మీదుగానే వస్తూంది. మెరుపు మెరిసినప్పుడల్లా పాములా బుసకొట్తూంది. ఉరుము ఉరిమినప్పుడల్లా గుండు పేలినట్టు చప్పుడవుతూంది. నాయుడు అనుకున్నాడు ఒక్క మెరుపయినా మెరిసి ఆ గడ్డివాములు తగలబడితే. అలా జరుగుతుందేమో చూదామని రోడ్డుమీదకి వెళ్ళి ఎదురుచూశాడు ఆశతో. అర్థరాత్రి అయింది. అందరూ నిద్రలో ఉన్నారు. నాయుడు మాత్రం ఎవరి కంటా బడకుండా అంతవరకు తిరుగుతునే ఉన్నాడు. దూరాన్న వర్షము ఆరంభమయినట్టుంది. దొరగారి గడ్డివాముల దగ్గరగా చేరాడు. వాన విజృంభించింది గనుక, ఇంక మెరపులవల్ల గడ్డివాములు తగలబడే అవకాశం లేదు. నాయుడు అగ్గిపుల్ల వెలిగించి ఆ వెలుగులో గడ్డివాములు చూశాడు. ఎంత ఎత్తుకి ఉన్నాయో! నిప్ప



# ఎన్నికల కలకలం

## 'భాస్కరం, ప్రభాకరం'

'ఫలాన'గారు మీాగులాముసుండీ!
ప్రజలంతా వోటిచ్చారంటే
పరోపకారం చేస్తారండీ!
ప్రజోపకారం చేస్తారండీ!
విజ్ఞానుడికే వోటివ్వండి,
అజ్ఞానుడి కసలివ్వొద్దండి.
అందుకోసమే 'ఫలాన'గారికి
పుుందాగా మీా వోటివ్వండి"

"రామరాజ్యమే తెస్తామండీ,
క్షామరాజ్యమే పోతుందండీ,
చచ్చుకబుర్లి న్నెందుకుపొండీ
స్వర్గం ఎదురొస్తున్నదిలెండీ!"

కాంగ్రెసువాళ్లూ, కమ్యూనిష్టులు
కాలికి బలపం కట్టుకునీ
వోటులకోసం ఏకధాటిగా
వాకచే తిరిగేస్తున్నారు.

* * *

పోలయగారికి ఎలక్షనంటే
చాలాచీదర, విసుగు, చిరాకూ:
కొంపలు ముంచుకుపోయినట్లుగా
గొంతుకు పెట్టుకు అరుస్తారని;

కొట్లోనుండే బెల్లంబుట్టకు
మట్టామూగే యీాగల్లాగా
వోటులకోసం చుట్టూజేరీ
వాకచే గడబిడ చేసేస్తారని!

పొద్దున్నే తనకొట్లోకూర్చుని
పద్దులుచూస్తూ పోలయగారూ
'కలకలమేమిటి చెప్మా' అంటూ
తలయెత్తుకు అటు చూశాడు!

అటువైపున ఆకాంగ్రెసువాళ్లూ,
ఇటువైపున ఈకమ్యూనిష్టులు!
అటువైపున అది గాంధీటోపీ,
ఇటువైపున ఇది ఎర్రనిజండా!

కాంగ్రెసువాళ్లటు వచ్చారు
ఖద్దరుదుస్తులు వేసుకుని.
కమ్యూనిష్టులు ఇటు వచ్చారు!
కొడవలి సుత్తీ పట్టుకుని!

"మాకివ్వండీ మీావోటు"
"మాకేనండోయ్ మీావోటు"
గోలగోలగా కేకలుపెడుతూ
పోలయకొట్లో కొచ్చారు.

"పోలయగారూ! మీావోటెవరికి?
పొందికగా మా కాంగ్రెసుకేవెయ్"
"నీవోటెవరికి పోలయబాబూ!
నిలకడగా మాపార్టీకే వెయ్"

"కాంగ్రెసుపార్టీకే జై అనండి"
"'కమ్యూనిస్టులుజిందాబాద్' అను"
"అనండి, అనండి, పోలయగారూ!"
"అనవేం, అనవేం, పోలయ్యా!"

చివరకు పోలయ ఖంగారయ్యేను,
ఎవరికి 'జై' అని అనగలడు?
ఇటు నటు చూసీ, పోలయ్యప్పుడు
"ఇద్దరికీ జై!" అన్నాడు.

# ద్వేషబీజం

తగిలిందా, ఒక్క పరకకి, మరుక్షణంలో అంతా భస్మమయి ఊరుకుంటుంది. ఇంకా నాయుడు ఆలోచన పూర్తి కానేలేదు. చేతిలోనున్న అగ్గిపుల్ల ఒక గడ్డి పరకను అంటింది. నిప్పు ఆ పరకమీాంచి పటపట చిన్న శబ్దాలు చేసుకుంటూ పైకి పక్కనూ ప్రాకుతూ గడ్డివాము అంతటికీ వ్యాపిస్తూంది. నాయుడు ఒక్క పరుగున ఇంటికి జారుకున్నాడు. ఇంటికి చేరక పూర్వమే తనవెనుక ఆకాశంలో పెద్దవెలుగు. గబగబా గుడ్డలు మార్చుకొని పక్క చేరుకున్నాడు. ఒకప్పుడు దొర భార్య పిల్ల గాని లేచేరేమో నిప్పు ఇంకా యింటిదాకి అంట లేదేమో? ఆ సమయాన్ని బయట ఏదో చప్పుడయింది. నాయుడు ముఖం కప్పేసుకొని నిద్రపోయాడు. కొద్దిగా నిద్రపోయి మామూలు వేళకు లేచి, వంటగది గుమ్మం దగ్గర కొచ్చి చూస్తే పొగ స్తంభంలాగ చెట్టు మీాద ఎగురుతూ కనబడగానే పరుగు పరుగున దొరఇంటికి వెళ్ళాడు. ఇల్లు, శాల పెరుడు అన్నీ దగ్ధమయాయి. రామయ్యదొర అక్కడ ఉన్నాడు. ఇంకా పది పన్నెండుగురు ఆడా మగా అక్కడ పోగయారు. వాకిట్లో కొన్ని వస్తువులు పడిఉన్నాయి. నిప్పు అంటుకున్న ఆ యింట్లోంచి బయటకు తీయగలిగిన కొంత సామగ్రి అది. అంతే మిగిలింది. పశువులు కట్టేసి ఉంటావ కాలి చచ్చిపోయాయి. ఆ కాలిన వాసనలు, ఇంకా ఎగుస్తున్న పొగతో అంతటా వ్యాపిస్తున్నాయి.

దొరకి తెలుసు నిప్పు అంటడానికి పూర్వమే పిడుగులవాన ఆగిపోయిందని. "వర్షం కురియడం మొదలయినంత వరకు నేను తెలివిగానే ఉన్నాను. ఈ దగ్గరలో పిడుగుపడితే నాకు తెలియకుండా ఉండేది కాదు." ఎవరో దారినపోయేవాడు అజాగ్రత్తగా నిప్పుపుల్ల విసిరేసి ఉంటాడేమో! అన్నాడు. కాని ఆ దారిన పోయేవాణ్ణి ఎవరూ చూడలేదు. ఎండుగడ్డి రాపిడివల్ల నే నిప్పుపుట్టిందేమో! ఒక్కొక్కప్పుడు అలా జరగడంకూడా కద్దు. "ఇంత ఎండినదాన్ని ఒక్కచోట ఉంచడమే పొరపాటు. ఇదంతా నా బుద్ధితక్కువవల్లనే జరిగింది" అన్నాడు దొర.

కామయ్యనాయుడు అన్నాడు. "దొరా, పోతాను పోతాను అని పోయావు కాదు. పొలాన్ని అమ్మతానని కూచున్నావు. ఇక ఇప్పుడేం చెయ్యాలి. ఇక్కడ ఉండి. కాని నువ్వు వెళ్ళిపోతే మాకుమాత్రం తీరనిలోటు." ఆ మాటలకి దొర నవ్వాడు. ఆ నవ్వులో ఏ

మాత్రమూ నిరుత్సాహం కనబడదు. "నే నెక్కడికీ పోవడంలేదు. పోను కూడ. నా అంతట నేను బుద్ధిపూర్వకంగా వయితే పోయివుందునుకాని తరిమి కొట్టానంటే భయపడి పారిపోతానా?" అది అసంభవం. సీతాయమ్మగారింట్లో చోటుఉంది రమ్మంటున్నది. ఒక్కత్తే ఊరికి చివరను పడివుంటున్నది. ఇదికూడ ఒక మేలుకే వచ్చింది. ఈ ఇంటిమీద మావాడు 'ఇన్సూర్' చేయించాడు. డబ్బు మళ్ళీ చలి ఆరంభించేలోపుగా వచ్చేస్తుంది. అప్పుడు మళ్ళీ ఇల్లు కట్టుకుంటాను.

'శుభం!' అలాగే జరగనీ - నీకేసహాయం నావల్ల కావలసినా పిలువు!"

"తప్పక పిలుస్తాను!" అన్నాడు దొర. దీనితో ద్వేషం ఇంకా పెరిగింది. ద్వేషంతో పాటు హడలుకూడా పుట్టుకొచ్చింది. తరువాత అతనికి జ్ఞాకానికి వచ్చింది. తన కత్తి పారేసుకున్నాడు. పాత పెద్దకత్తి. వాడి అయిన కొనతో తన మొలనే ఎప్పుడూ వేలాడుతూఉండేది. కొన్ని ఏళ్లగా అది తనవద్ద నుండేది. తాను గడ్డివాముల దగ్గరకు వంగి వెళ్తున్నప్పుడేపడిందో లేదా తను అగ్గిపుల్ల తీసినప్పుడు ఆ కత్తి జారిపడిందో తనుకుండే జాగ్రత్త పడవలసివుండేది. అదీ గాక పశువులశాల దగ్గర బురదలో పడ్డ తన అడుగుల జాడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

మరునాడు రామయ్యదొర ఇంటిపక్కగా వెళ్తూండగా దొర ఇంటి పెరట్లోని పోసపడ్డ బూడిదను ఎత్తించి పరిశుభ్రపరుస్తున్నాడు. నాయుడు సందేహిస్తూనే అడిగాడు. "ఏమిటిదొరా సంగతి?"అని. "ఏమీ లేదు. ఈ బూడిదలో ఇంకా ఏమయినా విలువగల వస్తువులు తగలబడక మిగిలిఉన్నాయేమో చూదామని, తలుపులగొళ్లేలూ, బందులూ, మొదలయినవయినా వుంటాయి కదా! అని" అన్నాడు దొర. "ఏమిటో ఆశ!" అని ఎగతాళిగా అంటూ నాయుడు వెళ్లిపోయాడు. కాని తరువాత నాయుడికి జ్ఞాపకానికి వచ్చింది. ఆ బూడిదలో దొరకి తనకత్తి కనబడితే అది అతను సులువుగా పోల్చగలడుకూడ. చాలాసార్లు అతడు అకత్తిని తనదగ్గర చూశాడు." మీ పామూనులు వెతుకుతున్నారు. ఒక కన్ను నాకత్తి మీదకూడా వుంచండి. ఆనాడు మీ పెరట్లోనే ఎక్కడో జారిపడింది. మరి కనబడ లేదు."అని వుంటే ఎంత బాగుండేది. తనకు ఆమాత్రం బుద్ధిలేకపోయింది అని విచారించేడు నాయుడు. కాని ఇప్పుడు మరి లాభంలేదు. సమయం మించిపోయింది.

కాలం గడిచిపోయింది. దొరకి కత్తి కనిపిసే ఇవ్వా [illegible]

లేదా ఒక్కసారిగా తనమీదకి దాడి చెయ్యడానికి సన్నాహంగానీ చేస్తున్నాడా లోలోపల? తప్పకుండా అదే అయివుంటుంది. అని నాయుడు నిశ్చయించుకున్నాడు. దొరకి కత్తి దొరికింది. సమయానికి ఎదురుచూస్తున్నాడు. అంతే అనుకున్నాడు నాయుడు. దొర ఊరకనే పైపైన స్నేహం నటిస్తున్నాడు. లోపల ఎంతమోసము దాచుకున్నాడో. నాయుడు కూడ తన భాగానికేమీ తీసిపోలేదు. దొరకి చెయ్యవలసిన సహాయం చేస్తూనేఉన్నాడు. పెద్ద పెద్ద చెట్లు కొట్టి దూలాలు కోయించడానికి సిద్ధంచేస్తున్నాడు దొర. శీతకాలం ప్రవేశించక పూర్వమే. మళ్ళీ ఇల్లు తయారవాలి. నాయుడుదగ్గర మంచి కలప ఊరికనే పడిఉంది. దొరని ఆ కలప ఉపయోగించుకోమని బలవంతం చేశాడు. డబ్బు పుచ్చుకునేందికి నిరాకరించాడు.

ఇద్దరూ కలసి కలప సిద్ధంచేస్తున్నారు. 'చుక్క' కనిపించింది. 'చుక్క' కాదు. దానికి సంబంధించిన శరీర శేషము. నది ఒడ్డున చిన్న గోతిలో. దొరే ముందు చూశాడు. కొద్దిదూరంలోఉన్న నాయుణ్ణి పిలిచాడు.

"ఇది చూడవయ్యా!"

"ఏమిటది?" అని అడిగాడు నాయుడు, దొర మాటల్లో ఏదో విచిత్రం ఉండడం చూసి.

"ఇదుగోనయ్యా చుక్క! చూద్దూ!"

నాయుడు జంకుతూనే వెళ్లాడు దొరకు దగ్గరగా. తన స్వంత క్షేమాన్ని కూడ కొంతవరకు ఆలోచించి చేతిలో గొడ్డలి పట్టుకునే

## ★ ద్వేషబీజం ★

వెళ్ళాడు. కాని దొర ఏమీ కోపగించినట్టు కనిపించలేదు. ఎవర్నీ నిందించలేదు.

"నేను అనుకున్నట్టే అయింది. ఇక్కడ దాకా ఈడ్చుకొని వచ్చి ఇక్కడ చచ్చి పడింది చూశావా?" అన్నాడు.

నాయుడు ఒకసారి చూడక తప్పింది కాదు.

"అవును. అంతే అయివుండాలి. యథార్థంగా?" అని దొరతో ఏకీభవించాడు దొర మీద ఓ కన్ను ఉంచుతూ.

"పాపం! దిక్కుమాలిన చావు చచ్చింది. ఇంటికి తిరిగి వచ్చేసివుంటే ఏదో విధంగా బతికేటట్టు చూసివుందును." అన్నాడు దొర. నాయుడు ఏమీ మాట్లాడలేదు. దొరకి వెనకాలే నిలబడ్డాడు. "రేపు ఒక పార తీసుకొనివచ్చి ఇంత మట్టితవ్వి దాని మీద పోసిపోతాను." అనుకున్నాడు.

నాయుడికి అనుమానం నిశ్చయమయింది. దొరకి యథార్థం తెలిసిపోయింది ఈ రోజుతో. ఈరోజుకి ఈ చేసినపని చాలు అనుకున్నాడు. "నా నడుం పీకుతోంది గానీ కాస్త వేగంగా ఇంటికిపోయి పడుకుంటాను!" అన్నాడు నాయుడు.



"నేను కూడా పోతాను. ఈవాళకి ఈ చేసినపని చాలు." అన్నాడు దొర. 'చుక్క'కి ఏమిచ్చి ఉంటుందో చావడానికి," అనుకున్నాడు.

ఇద్దరూ ఎవరి దారిని వాళ్ళు వెళ్ళిపోయారు. నాయుడికి అనుమానం అధికంగా పీడించడం మొదలుపెట్టింది. దొరకి ఇప్పటికీ యథార్థం తెలిసిఉండక పోవడం అసంభవం. 'చుక్క' చచ్చిపడివున్న స్థలానికి తన ఇంటికి అరమైలు దూరమయినా లేదు. తను చూశాడు ఆవేళ ఆ చెట్లదగ్గరగా వెళ్ళడం. అక్కడికి మరి పదిగజాల దూరంలోనే పడివుంది చుక్క. ఇందులోవున్న రహస్యం ఎంత మూర్ఖుడికయినా ఆఖరుకి దొరవంటి శుద్ధ చాదస్తపు మందబుద్ధికి కూడ స్పష్టంగా తెలిసిపోతుంది. నాయుడుకి దొరమీద వున్న ద్వేషం అతని చూపుల్లోనే అవతల మనిషికి తెలుస్తున్నదేమో అనుకున్నాడు. దొరకి ఈ సంగతి ఎన్నాళ్ళకిందటనో తెలిసే వుంటుంది. నాయుడు ఇంటి తలుపులు అన్నీ బిగించుకొని పడుకుంటున్నాడు రాత్రుళ్లు. దొర కంటబడకుండా సాధ్యమయినంతవరకు తప్పించుకొని తిరుగుతున్నాడు. ఎప్పుడూ ఇంటిపట్టునే ఉంటున్నాడు. ఎప్పుడోగాని పనిలోకి పోవడం లేదు.

తెల్లార్లయింది నాయుడుదొరని చూసి. ఒకనాడు సూర్యాస్తమయ సమయంలో దొర తన యింటివేపు రావడం చూశాడు నాయుడు తన వంటయింటి గది కిటికీల్లోంచి. దొర లోపలికి వస్తూనే సరాసరి వంటగది గుమ్మందగ్గరకు వచ్చాడు. నాయుడుకి భయంతో దవడలు కొట్టుకుంటున్నాయి. వంటగదిలో ఒక మూల నక్కి కూచున్నాడు ఎలుకలాగ.

"ఏం చేస్తున్నావయ్యా ఇంట్లో కూచుని!" అని పిలిచాడు దొర. నాయుడికి గదిలో తలుపుసందున తుపాకి కనిపించింది. అది సమయానికి 'లోడ్' చేసివుంది. దాన్ని ఒక చేత్తో పట్టుకొని తలుపు తెరచాడు.

"ఒస్తాం దొరా! నేను ఇప్పుడే బయలుదేరుతున్నా రెండు పక్షుల్ని కొట్టుకొద్దామని!"

"పక్షి వేటకింకా ఇప్పుడు వేళ ఎక్కడవుంది గానీ..." అన్నాడు దొర.

"సరేలే దానిమాటుకేం. ఇలా వచ్చి కూచోరాదు!!"

"కూచునేందికి తీరకలేదు. నీతో చెప్ప వచ్చిన మాటఏమిటంటే రేపు తెల్లవారుఝామున బయలుదేరి మనమొక దుప్పిని కొట్టుకొని రావాలి.

నువ్వు వస్తావంటావా?"

దుప్పులవేటకి యిది కాలం. నాయుడు వెంటనే ఏజవాబు చెప్పలేకపోయాడు.

"మందలతో అవి ఎక్కడికి వస్తున్నదీ నాకు తెలుసు. తెల్లవారేలోగా ఒక దుప్పయినా పడి తీరుతుంది!" అన్నాడు దొర.

"ఎక్కడ అది?" అని తొందరగా ప్రశ్నించాడు నాయుడు.

నాయుడు బుర్రలో ఆలోచనలు చాలా తీవ్రంగా పరుగెత్తున్నాయి. దొర లోపలి ఉద్దేశం ఏమిటో తనకు బోధపడ్తోంది. ఇప్పటికి దొరకి యథార్థం పూర్తిగా తెలిసివుంటుంది. చుక్క కళేబరము, పెరట్లో పెద్దకత్తి కనబడక ఇంకా తెలియకుండా వుంటుందా? కాని దొర తొణకడు, అలాగని ఊరుకోడు. ఎలాగో ఒకలాగు తను అనుకున్నంతపనీ చేసితీరతాడు. అందుకనే గాబోలు ఇప్పుడువచ్చి దుప్పులవేటకు తనను రమ్మంటున్నాడు. దుప్పి అనుకొని మనుష్యుల్ని కాల్చి పారేసిన సందర్భాలు ఇదివరకు ఉన్నాయి. ఇకముందు ఉంటాయి కూడ. ఇద్దరు దుప్పులవేటకని బయలుదేరి వెళ్ళి తెల్లవారేక ఒక్కడే ఊరికి తిరగొచ్చి "అబ్బాయిలూ, చాలా ఘోరం జరిగిపోయింది. నేను నాయుడూ ఇద్దరమూ ఒక్క దుప్పికోసమే పరుగెత్తాం. నేనేదో చూసి దుప్పిఅనుకొని కాల్చేసి తీరా చూసేసరికి ఆగుండు తగిలింది నాయుడికి!" అని చెప్పవచ్చు. ఎవరూ దొరను నిందించరు. ఇటువంటి ప్రమాదాలు సాధారణంగా జరుగుతూ వుంటాయి.

నాయుడు నీళ్లు నమిలాడు. తనకు దుప్పి అక్కర్లేదు. ఒకటి కొట్టుకొచ్చిన లాభం లేదు.

ఒకటి పడుతుందనే నమ్మకం కూడ లేదు. ఒక వంద సమాధానాలు చెప్పాడు. దొర అవేవీ వినిపించుకోలేదు. ఆఖరుకి నాయుడే విసుగెత్తి "సరేనయ్యా వస్తాను. మరెప్పుడు బయలుదేరుదాం చెప్పు!" అన్నాడు.

లోపల్నించి ఉబుకొస్తున్న కోపాన్ని గట్టిగా పెదవులలో బిగబట్టి. దొర ఏ ఉద్దేశంతో అయితే ఈ వేటకు దిగాడో ఆ పని చెయ్యడానికి తనూ సముద్యుడే. దొరకి మాత్రం నాయుడు మాటల్లో వింత ఏమీ కనిపించలేదు. నాయుడు అంగీకరించినందుకు ఆయన చాల సంతోష పడ్డాడు. "కోడి కూసే వేళకు వచ్చి పిలుస్తాను" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఆ రాత్రి, నాయుడుకి నిద్ర పట్టలేదు. భయంతో ద్వేషంతో రోషంతో గుండె మండిపోతూంది. తనలో ఏ దోషమూ లేదు. ఇప్పుడు తనమీద దాడి చేస్తున్నారు. చంపడానికి ఎత్తు వేస్తున్నారు. దుక్కకి విషం పెట్టి చంపడానికి పూర్వం నాయుడు దొరకి ఎన్నెన్నో చిన్న చిన్న అన్యాయాలు చేశాడు. అయితే అవన్నీ స్వల్పమైనవి. దొర వాటిని లక్ష్యపెట్టలేదు. అందువల్ల అవి నాయుణ్ణే ఎక్కువగా బాధిస్తున్నాయి. ఇప్పుడు దుక్కకి విషం పెట్టి చంపడంవల్ల నాయుడికి కొంత సంతృప్తి కలిగిన మాట నిజమే. కాని తను ఆశించిన ఫలితాన్ని యివ్వలేకపోయింది. "దుక్కను ఎవరూ విషం పెట్టి చంపి ఉండరు" అనే దొర విశ్వాసం తన ప్రయత్నాన్ని పాడు చేసింది. నాయుడు దొరను అంతగా ద్వేషించేవాడు ఎందుకంటే దొరకి తనని ద్వేషించేవాడుఅంటూ ఎవడూ ఉండడనే విశ్వాసాన్ని మాన్సే. కాని దొర నాయుణ్ణిమాత్రం మోసం చెయ్యలేదు. తన వేదాంతపు కబుర్లతో. ఈ స్నేహానికి వెనకాల ఎంత ద్రోహం కుట్ర దాచబడిఉందో తనకు బాగా తెలుసును. ఆ ద్రోహానికి తను సిద్ధపడే వున్నాడు.

మర్నాడు ప్రొద్దుటే దొర వచ్చి పిలవగానే నాయుడుకి దొర ఉద్దేశం స్పష్టంగా తెలిసిపోయింది. కొండకి అవతలనున్న చిన్న అడివిలోకి వెళదాం అనుకున్నారు. "వారం రోజుల క్రిందట వెళ్లాను అక్కడికి. దుప్పుల జాడలు బాగా కనిపిస్తున్నాయి. నువ్వొకపక్క నేనొకపక్క కాసేమంటే తెల్లవారేలోగా ఒకటి కొట్టుకొని భోజనాలవేళకు ఇంటికి తిరిగి చేరుకోవచ్చు!" అన్నాడు దొర.

"ఇది మీ యింటవిందు. నువ్వే ముందు దారితియ్యి" అన్నాడు నాయుడు. ఆముసక చీకట్లో చెట్లనడుమ దొర తన వెనకాల రావడం నాయుడికి అంత సురక్షితం, అనిపించలేదు. దొరే దారితీశాడు. మైలు రెండుమైళ్ళు నడిచాక గమ్యస్థానం చేరుకున్నారు. దొర ఆగాడు. నాయుడు దగ్గరగా వచ్చాడు. ఇద్దరూ నెమ్మదిగా మాట్లాడుకున్నారు. ఎవరు ఎక్కడ కాపు కాయాలా అని చర్చించారు. దొరనే ఆ నిర్ణయం చేయమన్నాడు నాయుడు.

"ఇదుగో ఇక్కడనుంచి కాపు. ఆ పెద్ద రాయికింద దక్షిణంగా గొయ్యివుంది. చూశావు కదూ. ఒక్క చుట్టుచుట్టి నువ్వు అక్కడికి చేరుకో రాతికి గోతికి మధ్య కాపుకాయి. నువ్వెక్కడ వుండేదీ నాకు తెలుసును. ఆప్షపు కాల్చకుండా నేను చూస్తాను. నేను ఒక చుట్టుతిరిగి ఈ రెండోవైపు ఆ దిగువకి కాస్తాను. ఆ పెద్ద రాతికిందనే పొంచివుంటాను. చుట్టుపక్కల స్పష్టంగా కనిపిస్తూంది. తెల్లవారగానే ఒకరు ఉండేవైపు ఇంకొకరు కాల్చకుండా చూసుకోవాలి!" అన్నాడు దొర. నాయుడు బుర్ర ఆడించాడు. ఆ పెద్ద రాయికూడా తెలుసునన్నాడు.

అవకాశం దొరగానే కొట్టు నాకోసమని ఆలోచించకు నేనూ అంతే చేస్తాను. ఎలాగయినా దుప్పి పడడమే ప్రధానం. ఎవరు కొట్టారు. అని ప్రశ్నకాదు." అన్నాడు దొర.

నాయుడూ ఒప్పుకున్నాడు. ఇద్దరూ వేరువేరు దారులు పట్టారు. నాయుడు దక్షిణంగా నాలుగు అడుగులు వేసి, ఒక్కక్షణం ఆగి వెనుకకు తిరిగి చూశాడు. దొర చాలాదూరం వెళ్ళి



**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫోటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకేవైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగిటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫోటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

— సంపాదకుడు.

# ★ ద్వేషబీజం ★

పోయాడు. అతని అడుగు సవ్వడి వినిపించడంలేదు. అతను వెళ్లినదారికే వెనుకవెనుకనే బయలుదేరేడు నాయుడు. దొర నిర్ణయించిన స్థలంలో కాపు వెయ్యడానికి నాయుడికెంతమాత్రము ఇష్టంలేదు. దొర దిగివెళ్ళిన దారినే తానుకూడా వెళ్లాడు. కొద్దిదూరం వెళ్ళి మళ్ళీ గుట్ట ఎక్కాడు. నిశ్శబ్దంగా గుట్టకి ఎత్తైన ఒక చివరకు చేరుకున్నాడు. అక్కడ ఒక గొయ్యిలాగ ఉంది. దానిలో ఒదిగాడు. తెల్లవారింది. ఆ వెలుగులో ఎదురుగా పెద్ద రాయి. స్పష్టంగా కనిపిస్తుంది. దానిదగ్గరే దొర పొంచివున్నాడు. ముందుకి ప్రాకుతూ వచ్చాడు నాయుడు. అక్కణ్నుంచి వందగజాల దూరంలో దిగువనుంచి ఎవరు వస్తున్నా కనిపిస్తారు. దొర ఎర్రటి టోపీ పెట్టుకున్నాడు. సుళువుగా తెలుస్తుంది. నాయుడు తొడిగింది ఎర్రఉలు కోటు. ఇప్పుడు అది విప్పేసి పక్కను దాచేశాడు. కడుపుమీద ఆనించి పడుకున్నాడు. తను కనబడకుండా ముందుకి తీగలు ముళ్ళడొంకలు తెరలు కట్టినట్టు ఉన్నాయి.

ఉదయం మబ్బువేసింది. వర్షం సూచనలు కనిపిస్తున్నాయి. మేఘాలు దిగువగా ఉండడంవల్ల వెలుగు కొద్దికొద్దిగా వస్తూంది.

నాయుడికి ఆలోచించుకునేందికి తీరిక చిక్కింది. తను ఇంటికివెళ్ళాక ఏమని చెప్పాలి ఊహించుకుంటున్నాడు. "దొర పెద్ద రాతికింద దాగి ఉంటానని చెప్పాడు. రాతికి రెండువందలగజాలదూరంలో దుప్పి కనిపించినప్పుడు దాన్ని కాల్చకుండా ఎలా వుండగలం. అది దొరే అని ఎలాగ అనుకోగలను!" ఎవరూ తనమాట విశ్వసించకుండా వుండలేరు. దొరచావుకి తన్నెవరూ నిందించలేరు. దుప్పి అయివుంటుంది. అన్నప్పుడు ఈప్రమాదం జరగడంలో విచిత్రం ఏమీలేదు అని అందరికీ తెలుసును. అయితే దొర నిజంగా చచ్చినదీలేనిదీ తేల్చుకొని మరీ వెళ్ళాలి. లేకుంటే దొర తిరిగొచ్చి ఇదంతా పచ్చి అబద్ధం అని చాటేస్తాడు. కాని తనగురి తప్పేదికాదుగా. దాన్ని గురించి అతను సందేహపడనక్కర్లేదు. వెలుగు హెచ్చవుతున్నకొద్దీ దొరజాడ కనిపెట్టాలని ప్రయత్నించాడు నాయుడు. కాని లాభం లేకపోయింది. తాను దాగిన స్థలం కొద్దిగా లోతులో ఉండడంవల్ల రాతి కిందకి ఏమున్నదీ కనిపించడంలేదు. దొర ఆరాతికిందనే ఉన్నాడు.

రాతిమీద తుపాకి పెట్టి దొర వుండేవైపు గురిచేసి జాగ్రత్తగా చూస్తున్నాడు నాయుడు. దొర జాడ దొరికితే చాలు కాల్చేయడానికి. ఇన్నాళ్లుగా తాను ద్వేషిస్తూవచ్చిన వ్యక్తి ఈరోజుతో అంతం కావచ్చు. కాని దొర కనబడకపోయేసరికి స్థలం మార్చుకోవలసివచ్చింది నాయుడికి. రాతికి మరికొంచెం దూరంలో మరొక చిన్నగొయ్యి వుంది. దానికికూడా ముందుకి ముళ్లడొంకల్ని చుట్టుకొని తీగలు తెరలు అడ్డుతున్నాయి. అక్కడ్నుంచి చూస్తే దొర ఉండే చోటు స్పష్టంగా కనిస్తుంది. అక్కడికి నెమ్మదిగా ప్రాకడం ప్రారంభించాడు నాయుడు. ఎర్రకోటు తీసేస్తే అతడు ధరించినది ఖాదీషర్టు, పేంటు. వేట కోసమని ఎన్నాళ్లో కిందటో కుట్టించుకున్నది. మెల్లమెల్లగా ముందుకు ప్రాకుతున్నాడు. అరచేతులమీద, ముడుకులమీద ఆనుకుంటూ జాగ్రత్తగా శబ్దము లేకుండా ఆ తీగలనడుమనించి తను కనబడకుండా ఉండేలాగ చూసుకుంటూ కదిలినప్పుడల్లా ముందుగా చేతులు ఎక్కడ పెట్టాలో చూసుకుంటూ ముందుకు ప్రాకుతున్నాడు నాయుడు.

పెద్దరాతికింద పొంచివున్న రామయ్యదొర, చుట్టుపక్కల కలియచూస్తున్నాడు తీక్షణంగా. దుప్పిజాడ ఎక్కడా లేదు.

"ఒకసారి మా తలనూ నెను వాడి చూస్తే మీకే తెలుస్తుంది." - "మీరు చెప్పినట్లుగా వాడాననుకోండి - కొంప తీసి పెరగటానికి బదులూ, ఉన్న జుట్టు కాస్తా రాలిపోతే -"

"అలా రాలిపోతే - ఆ బాటిల్ తీసుకొని మా షాపుకు రండి ... మీకు మరి మూడు సీసాలను ఇనాముగా ఇస్తాను!!

* * *

"ఏమిటోయ్! ఇటీవల మీ అన్నకూ నీకూ ఆస్తివిషయంలో ఏదో తగాదా వచ్చిందని విన్నాను ఏమయిందేమిటి?"

"ఏమైందీ - భూమి వంతు నాకు వచ్చిందీ - ఇల్లు మా అన్నవంతుకు పోయింది."

"మరి బ్యాంకులో ఏదో రొక్కంకూడా ఉందనివిన్నానే- అదేమైంది"

"అది లాయర్ వంతుకు పోయింది."

* * *

కాని అతని కళ్లు మాత్రం నలుదిక్కులూ పరికిస్తున్నాయి. ఒక వందగజాలదూరంలో కొండ ఎత్తులో ముళ్లడొంకల్లో ఒకదుప్పి కదుల్తున్నట్టుంది. దాని తలతుప్పల్లో కప్పబడిపోయింది. దాని బుజాలు మాత్రం కనిపిస్తున్నాయి. నాయుడు ఆ రెండోవైపు ఉన్నాడు అక్కడ్నుంచి ఈదుప్పిని చూడడానికి అతనికి వీలుకాదు. నాయుడుతోనే ఈ వేట దొరికితే ఎంతబాగుండేదనుకున్నాడు దొర. అయితేనేమి? వాళ్లు ముందుగానే అనుకున్నారుగా ఎవరికంట బడితే వారే కాల్చేయవచ్చు అని. నెమ్మదిగా ముందుకు వంగి జాగ్రత్తగా గురిచూసి మోకాలు మీంచి బుజాలవరకు తుపాకిని తీసుకుని వచ్చి కాల్చాడు దొర.

దొర గురికూడా తప్పేదికాదు. దేన్నయితే అతను గురిచూసి కాల్చేడో దానికే సూటిగా వెళ్లి తగిలింది గుండు.



# పోస్టుమన్ చేసిన తమాషా

మూర్తి తాళం తీసి తలుపు లోపలకు నెట్టేసరికి అక్కడ ఒక ఉత్తరం పడిఉంది. అతనికి వచ్చే ఉత్తరాలన్నీ సామాన్యంగా ఆఫీసుకే వస్తాయి. అలాంటిది ఈవేళ ఈ ఉత్తరం పోస్టుమన్ తలుపు సందులోనుంచి పడవేసి వెళ్ళాడేమా అని ఆశ్చర్యపోతూ అడ్రసు చూశాడు. తన పేరే ఉంది. కవరు చించి లోపల చదివాడు. ఏమీ బోధపడలేదు. ఉత్తరం చివర చూశాడు: క. వెంకటప్పయ్య అని ఉంది. ఎవరూ ఈ వెంకటప్పయ్యగారు? — తనెన్నడూ ఎరుగడే! తన బంధువులలో ఈ పేరున్న వారున్నట్టు అతనికి జ్ఞాపకం లేదు. ఈ వ్యక్తి ఎవరో తన పట్ల చనువుగా సంబోధిస్తున్నాడు. అపరిచిత వ్యక్తి తన నలా సంబోధించినందుకు అతనికి అసహ్యం కూడా వేసింది. అయినా ఉత్తరం జాగ్రత్తగా చదివాడు. అది ఇలా రాసి ఉంది:

"చిరంజీవి మూర్తికి ఆశీర్వాదాలు. నీకు నేను జ్ఞాపకం ఉంటే ఉంటాననుకుంటాను మీ నాన్న మా ఆవిడ మేనత్తకు మరిది. నీ పెళ్ళికి నేమంతా కూడా వచ్చాము. అప్పటికి నా మూడో అమ్మాయి కాంతం, అబ్బాయి రామం పుట్టలేదు. పెద్దమ్మాయిలిద్దరికీ మా ఆవిడ బ్రతికుండగానే పెళ్ళిళ్ళు చేసేశాను. వాళ్ళిద్దరూ ఇప్పుడు కాపురాలు చేస్తున్నారు. పిల్లలుకూడా బయలుదేరారు. ఇప్పుడు నా మూడో అమ్మాయి కాంతానికి పెళ్ళిచేయవలసి ఉంది. అది ఇంటర్మీడియేట్ వరకూ చదివి తప్పింది. కుర్రవాడు రామం స్కూలుఫైనలు చదువుతున్నాడు. కాంతానికి సంబంధాలకోసం వెతుకుతున్నాను. కాని ఏదీ కుదరడంలేదు. ఆపిల్లను చదివించడమే కొంపతీసింది. ఇప్పుడెంత లెంపలు వాయించుకుంటే మాత్రం ఏంలాభం? అది గొంతెమ్మ కోర్కెలు కోరుతోంది. దానికి ఇష్టంగా ఉండే సంబంధాలు నా తాహతులో లేవు. ఉన్న నాలుగెకరాలూ అమ్మివేస్తే రామం గతి ఏంకాను? ఏదో రెండువేలవరకూ పోదామనుకున్నాను. ఆపైన పెళ్ళి ఖర్చులో రెండువేలవరకూ ఉండవచ్చు గదా. కాని ఈ రెండువేల సంబంధాలకు కాంతం సుతరామూ ఒప్పుకోవడంలేదు. చాలా సంబంధాలు తీసుకువచ్చాను. అవతల వాళ్ళు ఇష్టపడుతున్నారు కూడా. అన్నీ సిద్ధపరచేయవచ్చు ననేవరకూ కూడా కొందరు వచ్చారు. తీరా మా కాంతం ఆ పెళ్ళికొడుక్కి లక్షవంకలు పెట్టడంవల్ల ఆ వచ్చినవారిని మర్యాదగా ఏవో కబుర్లు చెప్పి పంపివేయడం జరిగింది.

ఇలా చాలాసార్లు జరిగితే అప్రతిష్ఠకూడా వస్తుందని, ఈ పద్ధతి మానివేసి, సంబంధాల వాళ్ళతో ముందు మాట్లాడక, వాళ్ళున్నచోటికి కాంతాన్ని తీసుకువెళ్ళి అవతలి వారికి తెలియకుండానే దానికి కనిపించేటట్లు చేసి, పిల్లవాడు నచ్చాడంటే అప్పుడు సంబంధం విషయం మాట్లాడడానికి వెళ్తున్నాను. ఇలాకూడా అప్పుడే రెండుసార్లయింది. ఆ యిద్దరు వరుళ్ళకూడా ఒకడిని శూర్పణఖ రెండో అన్నగారి క్రిందా, ఇంకొకణ్ణి తోకొక్కటే తక్కువయిన హనుమంతుడి క్రిందా కాంతం వర్ణించి వేయడంవల్ల ఆ సంబంధాల జోలికిపోలేదు. మొన్న ఒకరు గుంటూరులో మంచి సంబంధం ఉందన్నారు. పిల్లవాడు బి. ఏ. ఆనర్సు పాసయినాడట. కాలేజీలో ట్యూటర్‌గా ఉంటున్నాడట. కొద్దిగా ఆస్తికూడా ఉందట. కట్నం అంత పెద్దగా లేదట ఈ సంబంధమైనా కాంతానికి నచ్చుతుందేమో నని ఆశగా ఉంది. కాని గుంటూరులో ఒకటి రెండు రోజులు బసచేసేందుకు బంధువులెవరూ లేరే అని చింతిస్తూ ఉండగా, అదృష్టవశాత్తు మొన్న మీ పెద్దతండ్రికొడుకు కనిపించి నీవు గుంటూరులో పనిచేస్తున్నావనీ, మీ యింట్లో చక్కగా బసచేయవచ్చుననీ చెప్పాడు. దానితో ప్రాణం లేచివచ్చినట్లయింది. నిన్ను నీ పెళ్ళికి చూడడమే కాని మరిమళ్ళా చూడలేదు కాబట్టి ఒకసారి నిన్నూ నీ భార్యాబిడ్డల్నీ చూడడంకూడా కలిసివస్తుందనీ — బహుశా నీవుకూడా ఈపాటికి పెళ్ళి తాపత్రయంలో పడిఉంటావనుకుంటాను — నేను మా కాంతం, రామాలతో రేపు సాయంత్రం అనగా శనివారం సాయంత్రం ఏడుగంటలకు అక్కడికి చేరేబండివిూద వస్తున్నాం. కాబట్టి నీవు స్టేషనుకువచ్చి మమ్మల్ని మీయింటికి తీసుకువెళ్ళవలసింది. నీవురాకపోతే మేము చాలా చిక్కులు పడవలసి వస్తుంది. కాబట్టి తప్పక స్టేషనుకు రాగలవని ఆశిస్తున్నాను.

గ్రహించవలెను,
క. వెంకటప్పయ్య.

P. S. నాకు కొంచెం పథ్యం. నాకు మాత్రం కూరలు చప్పిడిగా చేయించవలసింది. క. వె."

ఉత్తరం అంతా చదివి పెద్ద నిట్టూర్పు విడిచాడు మూర్తి. 'ఎంతభారతం రాశాడు!' ఇంతకీ అసలుసమస్య అలాగే ఉంది. ఈ వెంకటప్పయ్యగారెవరో తేలలేదు. ఆయన ఉత్తరాన్ని బట్టి తనకు నలభైయేళ్ళయినా ఉండాలి. కాని తనకు ముప్ఫైయేళ్ళే. పెళ్ళి తాపత్రయంలో పడి ఉంటావంటున్నాడు. కాని తనకు పిల్లలు పుట్టలేదు సరికదా భార్యకూడాపోయి నాలుగేళ్ళయింది. తనకు పెదతండ్రి ఎవరూ లేరు. అటువంటప్పుడు పెదతండ్రికొడుకు ఎలా ఉంటాడు? మరి ఈ ఉత్తరం అంతా ఏమిటి? అప్పటికి తోచింది మూర్తికి ఉత్తరం తనకు కాదనీ, తన పేరుగలాయనే ఆవూళ్ళో మరొకరుండి ఉంటారనీ, పోస్టుమన్ ఆయనకు ఇయ్యవలసిన ఉత్తరం తనకు తెచ్చి పడవేశాడనీ మర్నాడు పోస్టుమాన్ను పిలిచి ఉత్తరం అసలాయనకు చేరేటట్టు చేయాలనుకున్నాడు. మళ్ళీ ఒకసారి ఉత్తరంకేసి చూశాడు. "కాంతం" పెళ్ళి వ్యవహారం చదివి నవ్వుకున్నాడు. అంతలో అతనిదృష్టి వాళ్ళు వస్తున్నామనే ముక్కమీద పడింది. అన్నట్టు వాళ్ళు వచ్చేది ఆవేళే! బండి వచ్చేందుకు సరిగా గంటకూడాలేదు. ఇప్పుడా ఇంకొక మూర్తిగారికి ఉత్తరం అందజేయడానికి టైమేదీ? వాళ్ళు వస్తారు. స్టేషనులో తనచుట్టంకోసం చూస్తారు. స్టేషనుకు రాకపోతే చాలా ఇబ్బందిపడతామనికూడా రాశారు. పోనీ తనుపోయి వారికి సాయంచేసివద్దామా అంటే ఇంకా రాత్రి భోజనం తయారుచేసుకోలేదు. (మూర్తికి స్వయంపాకం అలవాటులెండి) పైగా ఆ వెంకటప్పయ్యగారు తనకు చప్పిడిచేయించమంటున్నాడు. ఎక్కడి తంటా వచ్చిపడింది! దీనికంతటికీ కారణం పోస్టుమనే! పోస్టుమాన్ను గట్టిగా కోప పడదామనుకున్నాడు. కాని కోపపడితే



# పోస్టుమన్ చేసిన తమాషా



ఇకనుంచి తనకు వచ్చే ఉత్తరాలుకూడా ఆ మూర్తిగారికే ఇచ్చివేస్తాడేమోనన్న భయం వేసింది. అసలు పోస్టుమన్‌ను కోపపడినా కోపపడకపోయినా ముందు ఇప్పుడు చేయవలసిందేమిటి? పోనీ వాళ్లఇబ్బందులు వాళ్లు పడతారు తన కెందు కనుకుందామంటే మనస్సు ఒప్పలేదు. వాళ్లు ఆశపెట్టుకొని వస్తారు. పైగా రాత్రివేళ స్టేషనుకు రాకపోతే, పాపం, నిజంగానే చాలా ఇబ్బంది పడతారు. ఇవన్నీ ఆలోచిస్తూ కూర్చోవడానికికూడా టైంలేదు. ఈ ఉత్తరం గొడవలోపడిఇంకా కాళ్లూ చేతులేనా కడుక్కోలేదు. అందువల్ల త్వరత్వరగా ఆఫీసుబట్టలు విడిచేసి, కాళ్ళూ చేతులూ కడుక్కొని, లుంగీ కట్టుకొని, చొక్కా, మఫ్లరు వేసుకొని స్టేషనుకు బయలుదేరాడు మూర్తి. దారిలో ఒకరిద్దరిని కనుక్కున్నాడు తన పేరుగలవారు మరొకర్ని ఎరుగుదురేమోనని. ఎవరూ తెలియదన్నారు. నిరాశచేసుకొని స్టేషను చేరుకున్నాడు.

బండివచ్చేందుకు ఇంకా పదినిమిషాలుంది. మూర్తి ప్లాట్‌ఫారమ్ టికెట్ తీసుకొని బండివచ్చేలోగా రిఫ్రెష్‌మెంట్ రూంకుపోయి కూల్‌డ్రింకొకటి తీసుకువచ్చాడు. బండి వచ్చింది. జనం దిగుతున్నారు, ఎక్కుతున్నారు. అంతమందిలో ఆ వెంకటప్పయ్యగారినీ, ఆయన సంతానాన్నీ తెలుసుకోవడం ఎలా? ఎందరో ముసలివాళ్లు దిగుతున్నారు. పడుచువాళ్లు దిగుతున్నారు. మూర్తి ప్లాట్‌ఫారం ఆచివరనుంచి ఈచివరవరకూ తిరిగాడు. ఒకవేళ అప్పుడే దాటిపోయారేమోనని కంగారుగా టికెట్ కలెక్టరుండేచోటికి వచ్చిపోయేజనాన్ని పరిశీలించసాగాడు. ప్లాట్‌ఫారం పలచబడింది. మధ్యలో ఒకచోట ఒక ఏభైఏళ్లు దాటినాయన, ఒక అమ్మాయి, అబ్బాయి అప్పుడే పెట్టెలో దిగి నిలబడి చూస్తున్నారు. వాళ్లే! అనుమానంలేదు. మూర్తి వాళ్లకేసి నడిచాడు. అతను రావడంచూసి రామం, కాంతం "ఆయనే కాబోలు నాన్నా," అన్నారు. వెంకటప్పయ్యగారుకూడా తమ చుట్టాన్ని చూసి చాలాఏళ్ళయింది కాబట్టి ఎలాఉంటాడో జ్ఞాపకంలేక మూర్తే తమ చుట్టం అనుకొని "ఏమోయ్, నీకోసమే చూస్తున్నాం. తీరా నీవు రావేమోనని భయపడిపోయాం. మాట దక్కించావులే" అంటూ నవ్వుతూ ముందుకు వచ్చారు. పరాయి ఆయన "నీవు" అని సంభోధించడం మూర్తికి కష్టంగాతోచినా మెల్లగానే అన్నాడు: "క్షమించాలి, నేను మీ చుట్టాన్ని కాదండీ. పొరబాటున మీ చుట్టానికి రావలసిన ఉత్తరం నాకు వచ్చింది. మీ రిబ్బంది పడతారేమోనని వచ్చాను." ఆయన వెంటనే తెల్లబోయారు. మీ పేరేమిటని అడిగారు. "ఆర్. గోపాల కృష్ణమూర్తి" అని చెప్పాడు మూర్తి. ఇతను తమ చుట్టరికం అర్థంచేసుకోలేదనే భావంతో ఆయన నవ్వుతూ అన్నారు: "ఇంకేమోయ్, నువ్వే. నీకు మన చుట్టరికం సరిగా అర్థంకాలేదనుకుంటాను. మీనాన్నగారు మా ఆవిడకు స్వయానా మేనత్తమరదినోయ్. మొన్ననేకదూ మీ పెద్దతండ్రి కొడుకు కనిపించి నీవిక్కడ పనిచేస్తున్నావని చెప్పింది." "క్షమించండి, నాకు పెద్దతండ్రి ఎవరూలేరు" అంటూ మూర్తి తన తండ్రిపేరూ, ఊరుపేరూ, వగైరాలు చెప్పి, "నాపేరూ మీ చుట్టం పేరూ ఒకటే అవడంవల్ల పోస్ట్‌మన్ ఒకరికీయవలసిన ఉత్తరం ఒకరికి ఇచ్చాడండి" అన్నాడు. వెంకటప్పయ్యగారు ఇప్పుడు పూర్తిగా నిశ్చేష్టులైపోయారు. అపును తన చుట్టం ఇంత పడుచువాడు కూడా కాదు! అప్పుడే కాంతం, రామం చెరో మూలనుంచి సణగడం ప్రారంభించారు: "నీ వెప్పుడు చేసినా ఇలాగే చేస్తావు నాన్నా. సరిగ్గా తెలుసుకోకుండా పిల్లి పిల్లల్ని తిప్పినట్లు తిప్పుతున్నావు మమ్మల్ని. ఈవేళ ఏ సత్రపు అరుగుమీదో పడుకోమంటావు." పాపం వెంకటప్పయ్యగారు తెల్లబోతూ కళ్ళజోడు తీసుకొని తుడుచుకొని, మళ్ళీ తగిలించుకొని తల గోకుకుంటూ మూర్తికేసి అర్థంలేని చూపు చూడసాగాడు. మూర్తి మొదట్లో వాళ్ళకు ఏ హోటలులోనో, సత్రపులోనో ఏర్పాటు చేసి వచ్చేద్దామనుకున్నాడు కాని వెంకటప్పయ్యగారి అవస్థ చూచేటప్పటికి అతనికి జాలికలిగింది. "ఇప్పుడేం చేస్తారు? మీరు మరో అభ్యంతరం లేకపోతే మాయింటికి రండి. ఈ రాత్రికి ఉందురుగాని. రేపు ప్రొద్దున్నే నేను మీ చుట్టాన్ని వెదకి తీసుకువస్తాను," అన్నాడు. కాంతం, రామం ఏ సత్రపు అరుగుమీదో మకాం తప్పిందని సంతోషించి 'పోదాం నాన్నా' అంటూ తండ్రిని చెరోపక్కా పట్టుకొని లాగసాగారు. ఆయన ఇంకా తికమక నుంచి బయటపడలేక 'సరే అలాగే కానీయండి' అన్నాడు.

బండి చేయించుకొని మూర్తి ఇంటికి చేరారు. మూర్తి తలుపుతీసి లైటువేశాడు. కాంతం లోపలికి అడుగుపెట్టగానే 'అయ్యో చాలా చిన్న యిల్లే' అంది. మూర్తికి చిరాకువేసింది. చిన్నయిల్లు కాకపోతే పెద్దయిల్లు వస్తుందేమిటి? తానొంటరిగాడైనప్పుడు తన కంతకన్న పెద్ద ఇల్లెందుకు? రెండే గదులున్నాయి పడకగదీ, వంటగదీ, తన కంతకన్న అవసరంలేదు. ఏదో కష్టపడతారుకదా అని జాలిపడి పిలిస్తే తన ఇల్లు చిన్నదనీ పెద్దదనీ ఎవరు వ్యాఖ్యానించమన్నారు? రామం ఒళ్లు విరుచుకుంటూ అక్కడఉన్న మంచం మీద కూలబడ్డాడు. "అబ్బా వెధవ ప్రయాణం, వెధవరద్దీ! ఒళ్ళు హూనమయిపోయింది. నిద్ర కూరుకువస్తోంది. త్వరగా అన్నం తినేసి పడుకుంటే బాగుంటుంది"

ఆచరించాడు. వెంకటప్పయ్యగారు మూర్తి కేసి సందేహిస్తూ చూస్తూ "అయితే-" అంటూ నసుగుతూండగానే ఆయన ఏమి అడగదలుచుకున్నాడో మూర్తి గ్రహించి, "వంటకాలే దండీ. నాకే నేను వండుకోలేదు. మీ ఉత్తరం ఇందాకనే చూశాను. చూసిందే తడవుగా స్టేషనుకు వచ్చేశాను. వండుకోవడానికి కూడా టైం లేకపోయింది" అన్నాడు. "ఇంట్లో వారు లేరా?" అని ప్రశ్నించారు వెంకటప్పయ్యగారు. భార్య పోయిందని చెపితే అప్పుడా సమాచారం మీద వచ్చే ప్రశ్న పరంపరకు సిద్ధం కావడం ఇష్టంలేక మూర్తి "లేరు" అన్నాడు ముక్తసరిగా. వెంకటప్పయ్యగారు అనుకున్నారు—భార్యా వాళ్ళూ ఏ ఊరో వెళ్ళి ఉంటారని. అప్పుడు అంతకన్న ప్రశ్నించలేదు - ఒకమూల ఆకలి వేస్తూండడంవల్ల మూర్తే అన్నాడు: "నేను పోయి హోటలు నుంచి భోజనం వచ్చే ఏర్పాటు చేస్తానండి"

"మరి నాకు చప్పిడికూర లెలా వస్తాయి" అన్నారు వెంకటప్పయ్యగారు. "అయిందిరా దేవుడా, ఇప్పుడు నన్ను వంట చేయమంటాడు కాబోలు, ప్రయాణంతో సగం చచ్చిఉంటేను" అంటూ మూల్గింది కాంతం. "పోనీలే తల్లీ. నేనీ రాత్రికి భోంచేయనులే. సరే బాబూ వాళ్ళకు మాత్రం భోజనం తెప్పించండి. నాకు ఏ బత్తాయిపళ్ళో తీసుకువస్తే గడుపుకుంటాను" అన్నారు. "వద్దులెండి, నేనే వంటచేస్తాను కావలసిన సరుకులు చూపిస్తేను" అంటూ కాంతం లేచింది. మూర్తి కాంతానికి వంటింట్లో సరుకులు చూపి తను వెళ్ళి హోటలులో భోజనం చేసి వస్తానన్నాడు. వెంకటప్పయ్యగారు రద్దు పెట్టారు "మా యింట్లోనే మీరు భోంచేయకపోవడమేమిట"ని. అందువల్ల మూర్తి ఆగిపోయి తనపని చూసుకోసాగాడు. వెంకటప్పయ్యగారు బడలిక మూలాన మాట్లాడకుండా కూర్చొని కునికి పాట్లుపడసాగారు. మరి కొంతసేపటికి వంటయింది. కాంతం తండ్రినీ, తమ్ముణ్ణీ లేపింది. మూర్తినికూడా పిలిచారు. భోజనాలయిన తర్వాత మూర్తి వాళ్ళకు పరుపూ పక్కా చూసి "ఇవే నా యింట్లో ఉన్నవి. ఎలాగో కాలక్షేపం చేయాలి మీరు, నేను మా స్నేహితుడింటికి పోయి పడుకొని ప్రొద్దున్నే వస్తా"నన్నాడు. వెంకటప్పయ్యగారు పెద్ద అడ్డు పెట్టలేదు. మూర్తి పొద్దున్నే వచ్చి వాళ్ళ చుట్టంకోసం వెతుకుతానని మళ్ళీ చెప్పి బయలుదేరాడు. కాని ఇవతలకు వచ్చిన తర్వాత ఏ స్నేహితుడింటికి వెళ్లడమా అనే ప్రశ్న ఎదురైంది. నలుగురిళ్ళకు వెళ్ళాడు కాని గడపవరకూ వెళ్లినతర్వాత పాపం వాళ్ళ నిబ్బంది పెట్టినవాడవుతానని ఆలోచించి, కాసేపు అక్కడా ఇక్కడా తిరిగి ఏమీతోచక రెండో ఆట సినిమాకు వెళ్ళి అది అయినతర్వాత ఒకసత్రవు అరుగుమీదకు చేరి పడుకున్నాడు. కటికనేల చాలాసేపు నిద్రపట్టలేదు. ఆఖరికి ఎలాగో నిద్రపట్టిన గంటకల్లా కాకులు అరవసాగాయి. లేవబోయేసరికి ఒళ్లంతా నొప్పులు చేసింది. అలాగే మొగం కడుక్కొని ఇంటికి బయలుదేరాడు.

అప్పటికి వెంకటప్పయ్యగారు మాత్రం లేచి భగవద్గీత పారాయణం చేసుకుంటున్నారు. కాంతం, రామం ఇంకా మంచి నిద్రలో ఉన్నారు. వెంకటప్పయ్యగారు మూర్తిని చూసి పిల్లల్ని లేపబోయారు. కాంతం ఊఁ ఊఁ అని మూలిగి ఇంకో ప్రక్కకు తిరిగి పడుకుంది. రామం ఎటు దొర్లిస్తే అటు దొర్లాడుకొని ఊఁ ఆఁ అని కూడా అనలేదు. మూర్తి "పోనీలెండి, వాళ్లప్పుడే లేవడం ఎందుకులెండి పాపం ప్రయాణంలో, రాత్రి ఆలస్యంతో బడలి పోయి ఉంటారులెండి," అని దొడ్లోకి పోయి స్నానంచేసి వచ్చి బట్టలు వేసుకున్నాడు. వెంకటప్పయ్యగారి చుట్టం కోసం బయలుదేరబోయాడు. అప్పటికీ కాంతంకాని, రామంకానీ లేవలేదు. "త్వరగా లేవండ్రా, అమ్మాయి, పరాయి ఇంట్లో కూడా ఇలా నిద్రపోతే ఎలా చెప్పు. ఆయనకు కాస్త కాఫీ కాచియివ్వవూ," అంటూ వెంకటప్పయ్యగారు కాంతాన్ని కదుపుతున్నారు. "నాకు కాఫీ అలవాటు లేదండీ. నేను వెళ్ళి మీ బంధువు సంగతి కనుక్కొని వస్తాను" అంటూ మూర్తి మెట్లు దిగాడు.

స్నేహితులనందరినీ అడిగాడు. వాళ్ళు మరొకళ్ళని అడగమన్నారు. వాళ్ళనీ అడిగాడు. అయినా లాభంలేకపోయింది ఆఫీసు వేళైపోయింది కాని అనుకున్న పని కాలేదు. ఆఖరికి ఆ పూట ఆఫీసుకి కాజుయల్ లీవ్ రాసివేసి హెడ్ క్లర్కుకు ఇచ్చి వచ్చాడు. ఎలాగో అలాగా ఆ మనిషిని కనుక్కొని వెంకటప్పయ్యగారినీ వాళ్లనూ ఆయన కప్పజెప్పి భారం వదిలించుకుందామనుకున్నాడు. అందువల్ల యింటికి రాకుండానే ఒక హోటల్లో భోజనంచేసి మళ్ళీ వెతకడం ప్రారంభించాడు. 'పోస్టుమన్'ను అడిగాడు. వాళ్లకూ గుర్తులేదన్నారు. ఆ ఊళ్లో ఏ ఆఫీసులున్నాయో జ్ఞప్తికి తెచ్చుకొని, అక్కడికిపోయి పరిచితులద్వారా ఆ ఆఫీసులో తన పేరుగలవాడెవరైనా ఉన్నారేమో కనుక్కోవడం మొదలు పెట్టాడు. చివరికి తెలిసింది: డిప్యూటీ కోపరేటివ్ రిజిస్ట్రార్ ఆఫీసులో ఒక గోపాలకృష్ణమూర్తిగారు రెండునెలలు పని చేశాడని, పదిహేను రోజులక్రితం మళ్ళీ శ్రీకాకుళం ట్రాన్స్ఫర్ అయి వెళ్ళిపోయాడనీని. వార్తతో ఇంటికి చేరాడు మూర్తి.

గుమ్మంలో అడుగుపెట్టగానే వెంకటప్పయ్య ప్రశ్నలవర్షం కురిపించసాగారు: "ఏమైంది? కనిపించాడా? వస్తానన్నాడా? ఇంటికే వెళ్లి కలుసుకున్నారా? భార్య ఏమంది?" అంటూ. మూర్తి మంచంమీద చతికిలబడి కాసేపు ఊరుకొని అన్నాడు: "ఆయన ఈఊళ్లో లేరండి" "మరి మొన్ననే కదా అతని పెద్దతండ్రి కొడుకు చెప్పాడు అతనీ ఊళ్లో పనిచేస్తున్నాడని" అన్నారు వెంకటప్పయ్యగారు. "అవునండీ. రెండు నెలలీ ఊళ్ళో పని చేశారట. కాని పదిహేను రోజులక్రితం ట్రాన్స్ఫర్ అయి వెళ్ళిపోయారట" అని చెప్పాడు మూర్తి. వెంకటప్పయ్యగారు ఉస్సూరుమన్నారు. "ఇప్పుడేం దారి?" అన్నారు అర్థస్వగతంలో. "వచ్చిందే దారి" అని కాంతం అనేసి మూర్తి తనకేసి చూడడం చూసి చటుక్కున నాలుక కరచుకుంది. రామం "ఎలాగా వచ్చాం కాబట్టి ఈ ఊళ్ళో రెండు సినిమాలేనా చూసిపోదాం. కొత్త ఊళ్లో సినిమాలు చూడడమంటే నాకు సరదా. నీకూ సరదాయేకదూ అక్కయ్యా. ఏమండీ మూర్తిగారూ, మమ్మల్ని మాటినీకి తీసుకువెళ్తారా. వీలైతే మొదటి ఆటకూడా చూసిరావచ్చు" అంటున్నాడు. కాని మూర్తి అతని మాటలు వినిపించుకోలేదు. అతి గారాబంతో పెరిగిన సంతానం అని స్పష్టంగా తెలుస్తోంది.

# ★ పోస్టుమన్ చేసిన తమాషా ★

తండ్రి గారాబం చూపిస్తే చూపించ వచ్చును కాని పైవాళ్ళెక్కడ చూపించ గలరు? కాంతం, రాముల మాటలూ, చేష్టలూ మూర్తికి కొంత అసహ్యం కలిగించాయి. అయినా వెంకటప్పయ్యగారిపట్ల జాలివల్ల ఏమీ అనకుండా ఊరుకున్నాడు. వెంకటప్పయ్యగారడిగారు "ఏం, బాబూ, ఏం చేయమంటారు మమ్మల్ని?" అని. మూర్తేం చెప్పగలడు? మాట్లాడకుండా కూర్చున్నాడు. "సరే రేపు ప్రొద్దున్నే బండికి వెళ్ళిపోతాం, బాబూ" అన్నారు వెంకటప్పయ్యగారు నిస్పృహతో. మూర్తి ఇన్నాళ్ళూ స్వేచ్ఛగా ఉంటున్నాడు. కాని వీళ్ళు వచ్చినప్పటినుంచీ క్షణం తీరిక లేదు. సరియైన తిండీ తిప్పలూ లేవు. తన ఇంట్లోనే తాను స్వేచ్ఛగా మసలడానికి వీలులేకపోతోంది. కాంతం, రాముల మాటలు మరీ చికాకు కలిగిస్తున్నాయి. వీళ్ళ నెంత త్వరగా వదిలించుకుంటే అంత మంచి దనిపించింది. కాని వెంకటప్పయ్య గారి నిస్పృహ చూసి జాలిపడకుండా ఉండలేకపోయాడు. "పోనీ రానేవచ్చారు గదా. సంబంధమేదో చూసుకుపొండి. ఈ వేళలాగే ఒకటి రెండు రోజులు మీరు గడుపుకోగల్గితే నాకేమీ అభ్యంతరం లే" దన్నాడు. వెంకటప్పయ్యగారికి ప్రాణం లేచివచ్చినట్లై: "అదృష్టంవల్లే మీరు మాకు దొరికారు నాయనా. లేకపోతే ఎన్ని తిప్పలు పడవలసివచ్చునో. మీరు చుట్టాలు కాకపోయినా చుట్టాలే. ఎలాగో ఈ సంబంధం కుదిరితే మీ పేరు చెప్పుకుంటాను.—అయితే మీ రాయన నెరుగుదురా. కాలేజీలో ట్యూటరుట. పేరు సుందరరావట" అన్నారు.

"కాలేజీల్లో నే నెవరినీ అంతగా ఎరగనండీ. మెల్లగా కనుక్కుందాం" అన్నాడు మూర్తి.

"సరే నాయనా, నే నూళ్ళోకి పోయి సంబంధంగూర్చి వివరాలు తెలుసుకువస్తాను —అన్నట్లు మీరింకా భోజనం చేయలేదు కదూ. ఈ గొడవలో ఆ మాటే మరచిపోయాం" అన్నారు వెంకటప్పయ్యగారు.

"భోజనం చేసేశానండి" అని చెప్పాడు మూర్తి.

"ఎక్కడ?"

"హోటల్లో"

"అదేమిటి మీ యింట్లో మీరు భోజనం చేయడానికేం? మా కోసమని మీరు హోటల్లో తినడ మెందుకు?"

"కాదులెండి. మళ్ళీ ఇంత దూరం రావడం బద్ధకంవేసి అలా చేశాను. అంతకన్నా ఏమీ లేదు."

"సరేకాని బాబూ, ఇందాకటినుంచీ అడుగుదా మనుకుంటున్నాను. మీవాళ్ళు పుట్టింటికి వెళ్ళారా? - ఏమన్నా—"

"లేదండీ నా భార్య పోయి నాలుగేళ్ళయిందండీ"

వెంకటప్పయ్యగారు ఎగిరి గంతేసినంత పని చేశారు. "పిల్లలున్నారా?" అని అడిగారు తేరుకున్నాక.

"లేరండీ"

"వయస్సు?"

"ముప్పై"

"అదేమిటి నాయనా, నాలుగేళ్లయి భార్యపోయి మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా ఉన్నావేం? ఇంకా చిన్నవాడివే. అనుభవించే వయస్సంతా ముందే ఉంది. సంబంధాలు నచ్చక చేసుకోలేదా?"

"అదేం కాదండీ. ఊరికే నే, మళ్ళీ పెళ్ళి చేసుకో బుద్ధివేయలేదంతే" నన్నాడు మూర్తి విషయం ఎలా మార్చడమా అని ఆలోచిస్తూ. కాంతం రామం మూర్తికేసి వింతగా చూశారు - ఇంత చిన్నవయస్సులోనే ఈయన కింతవైరాగ్యం కలిగిందేమాఅని.

"మీ రెంతమంది అన్నదమ్ములు?" అంటూ మళ్ళీ ప్రారంభించారు ఇన్వెస్టిగేషన్ వెంకటప్పయ్యగారు.

"ఇద్దరమండీ. నాకో తమ్ముడున్నాడు. వాడికి పెళ్లయింది. ఒక పిల్లవాడుకూడా. మాకు నాలుగెకరాలభూమిఉంది. మా నాన్నగారే చూస్తున్నారు భూమిని. మా తమ్ముడు ఇంకోకఊళ్ళో మాష్టరీ చేస్తున్నాడ" ని మూర్తి వెంకటప్పయ్యగారు అడగగల ప్రశ్నలన్నిటికీ ముందే జవాబిచ్చివేశాడు.

"ఇంతకీ నీవు పెళ్లిచేసుకోకపోవడమే చాలా ఆశ్చర్యంగాఉంది నాయనా - సరే నేను ఊళ్లోకిపోయి ఈ సంబంధం విషయంలో కనుక్కునివస్తాన" ని గొడుగు తీసుకొని బయలుదేరారు వెంకటప్పయ్యగారు.

రామం మూర్తిదగ్గరకువచ్చి, "ఏమండీ మిమ్మల్ని మూర్తి మామయ్యా అని పిలవాలనిపిస్తోంది అలా పిలవనా?" అన్నాడు.

"నీయిష్టం" అని నవ్వాడు మూర్తి.

"సరే మూర్తి మామయ్యా, మరి మమ్మల్ని మాటినీకి తీసుకువెళ్లడంమా లేంజేశావ్? ఇక్కడేంతోచడంలేద" న్నాడు రామం.

"మీ కే సినిమాలు ఇష్టం" అని అడిగాడు మూర్తి.

"మా అక్కకు ఇంగ్లీషుసినిమాలంటే ఇష్టముంటుంది - ఇంటర్‌మీడియేట్ చదివింది కాబట్టి. హిందీ సినిమాలుకూడా ఇష్టమే - ముఖ్యంగా దిలీప్‌కుమార్ ఉన్నవి -" అంటూ అక్కగారికేసి నవ్వుతూ చూశాడు రామం. "నాకు తెలుగుసినిమాలంటే నే ఇష్టం. హిందీ, ఇంగ్లీషువైనా ఇష్టమే. అసలు ఏదో సినిమా చూడాలి అంతే," నన్నాడు రామం.

"ఊళ్లో 'కోవాడిస్' ఆడుతోంది దానికి తీసుకువెళ్తాను. తయారవండి" అన్నాడు మూర్తి. రామం వేషం వేసేశాడు. కాంతం అప్సరసలా తయారయింది. మూర్తి మామూలుగానే బయలుదేరాడు. "మీరు

దుస్తులు మార్చుకోరూ" అంది కాంతం. "నా వేషం ఇంతే" నంటూ ముందుకు సాగాడు మూర్తి. "వైరాగ్యం చాలా ముదిరిందే" అనుకున్నారు కాంతం, రామం. సినిమా హాలుదగ్గరకు వెళ్ళినతర్వాత కాంతానికి జ్ఞాపకం వచ్చింది పాపం ఈ మూర్తిగారు చుట్టం కాకపోయినా ఈయన నెత్తినెక్కింది చాలక ఇలా సినిమాలకు కూడా తీసుకువెళ్లమనడం బాగుండదని. రామాన్ని అడిగింది "ఏరా, నాన్నదగ్గర డబ్బులు పుచ్చుకున్నావా?" అని. లేదన్నాడు రామం. "దేనికేమిటి నీనెత్తి సినిమాటికెట్లకి కావద్దూ" అంటూంటే మూర్తి "అదేమిటి, మీరు టికెట్లు కొనడమేమిటి, మీరు నా అతిథులు గౌరవించవలసినబాధ్యత నాది. నేను పట్టుకువస్తానుండండి" అని టికెట్లు తేవడానికివెళ్లాడు. కాంతం రామం బాగానే ఉందనుకున్నారు కాని ఇంత వైరాగ్యం ముదిరిన మనిషి ఏ థర్డ్ క్లాసుకో తీసుకుపోతాడేమోనని భయపడ్డారు. కాని మూర్తి ఫస్ట్ క్లాస్ టికెట్లే పట్టుకువచ్చాడు. ఆట మధ్యలో కూల్ డ్రింక్స్ కూడా ఇప్పించాడు. "నీవు చాలా మంచివాడివి, మూర్తిమామయ్యా" అన్నాడు రామం. సినిమాలో కాంతానికి కావలసిన రొమాంటిక్ దృశ్యాలూ, రామానికి కావలసిన స్టంటు దృశ్యాలూ కావలసినన్ని ఉన్నాయి. చాలా ఉత్సాహంగా ఉన్నారిద్దరూ. సినిమానుంచి వచ్చేటప్పుడుకూడా అదృశ్యాలే తలచుకుంటూ ఉల్లాసంగా కబుర్లు చెప్పుకోసాగారు. ఉన్నట్లుండి కాంతం మూర్తికేసిచూసి "బహుశా మూర్తి మామయ్యగారికిలాంటివేమీ రుచించవనుకుంటాను" అంది నవ్వుతూ. "వైరాగ్యం కాబట్టి కాదూ?" అన్నాడు మూర్తి నవ్వుతూనే. దారిలో వాళ్లకు ఆఊళ్లో చూడవలసినవి చూపించి వాటినిగురించి చెప్పాడు.

వాళ్లు ఇంటికిచేరేసరికి వెంకటప్పయ్యగారుకూడా తిరిగివచ్చారు. సంబంధం విషయంలో అన్నీ తెలుసుకున్నామన్నారు. వరుణ్ని కూడా చూశామన్నారు. తనకన్నివిధాలా సంబంధం నచ్చిందన్నారు. ఆయన ఎంతో ఉత్సాహంతో ఉన్నారు. కాంతం వంటచేసింది. భోజనాలు చేశారు. వెంకటప్పయ్యగారు ఇక ఆ వరుడు కాంతానికి కనిపించేటట్లు చేయడానికి పథకం ఆలోచించసాగారు. మూర్తిని కూడా సలహా అడిగారు. మూర్తి కేమీ తట్టలేదు. ఎంతసేపాలోచించినా సరియైన పథకం తయారు కాలేదు. పథకం ఆలోచిస్తూనే నిద్రవచ్చి గుర్రుపెట్టసాగారు ఆయన. మూర్తి బయటికి పోబోతూంటే కాంతం వంటింటిపని పూర్తిచేసుకొని వచ్చింది.

"ఏమండీ, మీదగ్గర ఏదైనా మంచిపుస్తకాలుంటే ఇచ్చిపోండి కాసేపు చదువుకుంటానంది." మూర్తి తన పుస్తకాల బీరువా తీసి చూపించాడు. రామం పుస్తకాలన్నీ తీసి అక్కగారికి చూపిస్తున్నాడు. బీరువాలో రకరకాల నవలలూ, కథల పుస్తకాలూ, ఇతర పుస్తకాలూ, మేగజీన్లూ_సినిమా పత్రికలుకూడా ఉన్నాయి. అవన్నీ చూసి కాంతం నవ్వుతూ అంది: ఇదేమిటి, ఇంత వైరాగ్యం ఉన్నవారికి ఈ పుస్తకాలన్నీ ఎందుకు?" మూర్తి మాట్లాడలేదు. "అయితే వైరాగ్యంవల్ల కాదన్నమాట ఇన్నాళ్ళూ పెళ్లిచేసుకోనిది, ఇంకొక కారణమయి ఉంటుంది. ఆ కారణమేమిటో కూడా నాకు తెలుసులెండి" అంది. "ఏమిటి చెప్పండి చూదాం" అన్నాడు కుతూహలంతో. "ఏ సినిమా తారలాంటి అమ్మాయో కావాలని చూస్తున్నారు. మీకు వచ్చిన సంబంధాలలో అటువంటివారు కనిపించి ఉండరు," అని తన అభిప్రాయం చెప్పింది కాంతం. మూర్తి నవ్వాడు: "ఊహు కనుక్కోలేకపోయారు, అదికాక సినిమా తారల్లాంటివారు నాలాంటివాణ్ణి పెళ్లిచేసుకుంటారా."

"ఎందుకు చేసుకోరూ?_ చేసుకునేవాళ్ళుండవచ్చు."

"పోనీ మీరు చేసుకోగలరా?"_

"ఏం సమాధానం వస్తుందో మీరు గ్రహించగలరనుకుంటాను" అంది కాంతం నిర్లక్ష్యంగా.

రామం అన్నాడు: "మూర్తి మామయ్యా మా అక్కను పెళ్లాడ దలచినవాడికి ఏం క్వాలిఫికేషన్లు కావాలో చెప్పనా" అంటూ కాంతం నోరు నొక్కుతున్నా చేతితో ఆమె చేయితీసి చెప్పటం మొదలుపెట్టాడు: "ఇరవై రెండేళ్లు దాటకూడదు, రెండో పెళ్ళివాడు కాకూడదు. అందగాడై ఉండాలి. దిలీప్ కుమార్ పోలిక ఉండాలన్నమాట. ఎం. బి. బి. ఎస్. లేక బి. ఇ అయితే ఫస్ట్ ప్రిఫరెన్సు. ఎం. ఏ. ఎం.ఎస్ సి అయితే సెకండు ప్రిఫరెన్సు. మంచి ఆస్తి ఉండాలి, మేడ, కారూ వగైరాలుండాలి, టెన్నిస్ ఆటకాడై ఉండాలి—" కాంతం నోరు మూసేసింది.

మూర్తి నవ్వుతూ "బాగుంది క్వాలిఫికేషన్స జాబితా. మరి నా క్వాలిఫికేషన్ చెప్పనా: వయస్సు ముప్పై, మొదటిభార్య పోయింది. తుమ్మచెక్క రంగు (!) ఆస్తి నాలుగెకరాలే. పల్లెటూళ్లో పెంకుటిల్లు. కారు కాదుగదా సైకిలుకూడా లేదు. టెన్నిస్ మాట అటుంచి పేకాటే నారాదు. పైగా వైరాగ్యంకూడా" అంటూ తన్ను తానే వికృతంగా వర్ణించుకున్నందుకు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. మళ్ళీ ఒక సత్రపు అరుగుమీదచేరి నడుం వాల్చాడు.

మర్నాడు పొద్దున్న అతను ఇంట్లో అడుగుపెట్టగానే కాంతం అడిగింది: "ఏమండీ, మీరు పెళ్ళిచేసుకోకపోవడానికి కారణం చెప్పనా" అని. "చెప్పండి" అన్నాడు మూర్తి విందామనే కుతూహలంతో. "మీకు స్త్రీలమీద ద్వేషంవల్ల కాదూ?" అని అడిగింది కాంతం. ఈసారి మూర్తి నవ్వలేదు. కొద్దిగా సందేహిస్తున్నట్లుగా అన్నాడు: "ద్వేషం అనడంకంటె భయం అంటే బాగుంటుందేమో." కాంతం నవ్వింది: "స్త్రీజాతి అంత భయంకరమైనది అని నిర్ణయానికి వచ్చారన్నమాట!" మూర్తి ఏమీ మాట్లాడలేదు. "ఎవరో ఒక స్త్రీవల్ల ఒక అనుభవం కలిగిందని మొత్తం స్త్రీజాతినే ఈవిధంగా భావిస్తే అది నిజంగా అన్యాయం అంటాను. నేనూ స్త్రీనే కాబట్టి మాపట్ల మీకిలాంటి అభిప్రాయాలు కలిగినందుకు ఎంతో విచారిస్తాను" అంది కొంచెం ఉద్వేగంతో. "నా విషయంలో మీ కెందుకింత అనవసర శ్రద్ధ? నేను పెళ్లికోసం మేమీ ఆతృతపడడం లేదు. ఆ విషయంలో ఎవరి సలహా కోరను, అక్కర్లేదు కూడా. ముందు మీ విషయం ఆలోచించుకోండి. వచ్చిందే అందుకు," అంటూ దొడ్లోకి చక్కా పోయాడు మూర్తి. అతను స్నానం చేసుకొని వచ్చినవెంటనే వెంకటప్పయ్యగారు అతనిదగ్గరకు వచ్చి ఏదో పెద్ద సమస్యను పరిష్కరిస్తున్నట్లుగా మొగం పెట్టి: "ఇంకా సరియైన పథకం



# పోస్టుమన్‌చేసిన తమాషా



తట్టలేదోయి. బహుశా సాయంత్రానికేనా ఆలోచించగలననుకుంటాను. కాని ఈ లోపుగా ఒకసారి ఆ వరుణ్ణి నీకు చూపిస్తాను వస్తావా" అన్నారు. అలాగే బయలుదేరాడు మూర్తి.

వెంకటప్పయ్యగారు మూర్తిని ఆవరుడు సుందరరావు, ఇంటివైపుకు తీసుకు వెళ్ళారు. సుందరావు ఇంటి ఎదురుగుండానే ఒక హోటలుంది. ఇద్దరూ ఆ హోటలులోకి వెళ్ళి కాఫీ త్రాగుతూ సుందరరావు ఇంటి కేసీ చూడసాగారు సి. ఐ. డి లలా. కాసేపటికి సుందరరావు ఇవతలికి వచ్చి తనకోసం వచ్చిన మిత్రులిద్దరితో ఏమో మాట్లాడి లోపలికి తీసుకువెళ్ళాడు. వెంకటప్పయ్యగారు మూర్తికి అతనిని చూపించి గుర్తుపెట్టుకోమన్నారు. "సాయంత్రానికి మా కాంతానికి అతను కనిపించేటట్లు చేసే ఏర్పాట్లు చేస్తాను. అప్పుడు వీలునుబట్టి నీవు కానీ, నేను కానీ కాంతానికి అతనిని చూపిద్దాం. అందుకే నిన్ను ఇప్పుడు తీసుకువచ్చా" నన్నారు ఆయన. ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు.

సాయంత్రం మూర్తికి ఎదురుగా పరుగెత్తుకువచ్చారు వెంకటప్పయ్యగారు "తెలుసుకున్నానోయి. ఈ వేళ రాత్రి అతను తన స్నేహితులతోబాటు సినిమాకు వెళ్తాడట. ఒకరివల్ల తెలుసుకున్నాను. కాంతాన్ని సినిమాకు తీసుకువెళ్తే అతను తప్పక కనిపిస్తాడు" అన్నారు. మూర్తికి చిరునవ్వు రాకుండా ఉండలేకపోయింది. ఆ సుందరరావుమీద ఈయన డిటెక్టివ్ గా పనిచేస్తున్నందుకు. చిరునవ్వు కప్పిపుచ్చబోయాడు కాని వెంకటప్పయ్యగారు చూడనే చూశారు. అన్నారు: "నీకు నవ్వు వస్తోంది కదూ, నాయనా - నేనిలా అవస్థపడుతున్నందుకు. అవును నీకు నవ్వుగానే ఉంటుంది నాయనా. మరేం చేయను? మగవాడు ఎన్ని సంబంధాలు తోసివేసినా పరవాలేదు. పైపెచ్చు అతనిలో ఏదో విశేషముంటుందనే భ్రమ కూడ కలిగి కట్నాల మార్కెటులో అతని విలువ పెరగవచ్చు

కూడా. కాని ఆడదే అలా చేస్తే మళ్ళీ ఒక్క సంబంధం రాదనుకో. అందుకే ఈ తిప్పలన్నీని." ఇద్దరూ లోపలికి వచ్చారు. "సరే, ఏ సినిమాకు వెళ్తాడో కూడా తెలుసుకువచ్చారా" అని అడిగాడు మూర్తి. "నిన్న మీరు చూసివచ్చిందే. 'కోవాడిసే' నట. నువ్వు తీసుకువెళ్ళి రావాలి" అన్నారు ఆయన. మూర్తి పెద్ద నిట్టూర్పు విడుస్తూ "చచ్చాం, మళ్ళీ అదే సినిమాకా! నిన్ననే తలనొప్పి వచ్చిందే. అందులోనూ నాకు వైరాగ్యంకూడా ఎక్కువ" అంటూ కాంతం వైపు తిరిగి నవ్వాడు. "మీరే తీసుకువెళ్ళండి" అన్నాడు. "కాదు, కాదు నాయనా. నాకు కళ్ళజబ్బుంది. సినిమా చూసే ఆపైన చాలా బాధపడవలసివస్తుంది. నీవే తీసుకువెళ్ళిరా, నాయనా. నాకోసం యీమాత్రం కష్టం తీసుకో నాయనా. అది చూసి సరే అంది అంటే రేపుప్రొద్దున్నే వారింటికి పోయి సంబంధం విషయం తేల్చివేసుకుంటాను. రేపు సాయంత్రమే ఇంటికి ప్రయాణం. దానితో నీకు మాభారం తొలగిపోతుంది. ఈ సంబంధం కుదిరితే నీవల్లేనని చెప్పుకుంటాను" అంటూ మూర్తిచేతులు పట్టుకోబోయారు. కాని మూర్తి "అయ్యో దీనికింత చెప్పాలా. అలాగే తీసుకువెళ్తానులెండి. ముందు భోజనంచేసి వెళ్తే బాగుంటుందనుకుంటాను" అన్నాడు. అలాగే అందరూ పెందరాళే భోజనం చేశారు. మూర్తి, కాంతం, రామం సినిమాకు బయలుదేరారు.

మూర్తి మళ్ళీ ఫస్ట్‌క్లాస్ టికెట్లే కొన్నాడు. 'ఎక్సిట్' దగ్గర కుర్చీల్లోనే కూర్చున్నారు. ఎందుకంటే ఎవరు వచ్చినా వారి ముందునుంచే వెళ్ళవలసి ఉంటుంది. అలాగే కొంతసేపటికి సుందరరావు తన స్నేహితులతో వచ్చి మూర్తివాళ్ల ముందరే కొంతసేపాగి, ఎక్కడ సీట్లు బాగా ఉంటాయో చూసుకొని, వాళ్లకు ప్రక్కన కొద్దిదూరంలో కూర్చున్నాడు. మూర్తి సైగచేసి కాంతానికిసుందరరావును చూపించాడు. కాంతం సుందరరావు కేసి ఒక్క రెండు క్షణాలు చూసి మొగం తిప్పివేసుకుంది. మూర్తి ఇంకా అతనికేసే చూపించసాగాడు కాని కాంతం అటు చూడనేలేదు మళ్ళీ. మూర్తి వెంటనే గ్రహించాడు ఆ సుందరరావు కాంతం పరీక్షలో తప్పిపోయాడని. కాని కాంతాన్ని కొంచెంసేపు ఉడికించాలనే ఉద్దేశ్యంతో "అడుగో వాళ్లతో మాట్లాడుతున్నాడు. అఁ అఁ నిలబడుతున్నాడు, అదే ఇటే చూస్తున్నాడే"

అంటూ వ్యాఖ్యానం సాగించాడు. ఆఖరికి ఇంటర్‌వెల్‌కు కాంతం లేచి ఇంటికి వెళ్ళిపోదామంది. ఉండమన్నాడు మూర్తి. ఉండనంది కాంతం. మూర్తికి అసలు అంతకన్న ఉండాలని లేదు. అందువల్ల వెంటనే లేచాడు. రామానికి కదల బుద్ధివేయలేదు. అక్కను ఉండమని బ్రతిమాలాడు కాని ఎవరూ తనమాట వినకపోయేసరికి మూలుగుతుంటూనే అతనూ వచ్చివేయవలసి వచ్చింది. దారిలో మూర్తి స్నేహితుడొకడు కనబడి "ఏరా, మూర్తీ, రాత్రిళ్లు సత్రపు అరుగుమీద–" అంటూండేటప్పటికే మూర్తి మూతిమీద వేలువేసుకొని తన స్నేహితుణ్ణి ప్రక్కకు లాగుకుపోయాడు. "గట్టిగా అనకురా. మా యింటికి చుట్టాలువచ్చారు. అందరికీ ఇల్లుచాలదని అక్కడకు పోయి పడుకుంటున్నాను అంతే" నన్నాడు. "పోనీ మాలో ఎవరో ఒకరిఇళ్లకు రాకూడదూ!" అని ప్రశ్నించాడు ఆ స్నేహితుడు. "మిమ్మల్ని అనవసరంగా ఇబ్బంది పెట్టడమెందుకని అలా చేశాను" అని మూర్తి చెప్పగా "స్నేహితులుండి ఎందుకురా. ఈ రాత్రి సత్రపు అరుగు చేరావో ఊరుకోను తెలుసా. మా యింటికిరా. నీకు ప్రక్క వేసి ఉంచుతాను" అని చెప్పి ఆ స్నేహితుడు వెళ్లిపోయాడు. కాని కాంతం మొదట్లో ఆ సన్నమాటలు వింది కాబట్టి మూర్తి దగ్గరకు రాగానే అంది "అయితే నిన్నా, మొన్నా ఎవరో స్నేహితులిళ్లకు వెళ్తాము అని చెప్పి సత్రపు అరుగుమీద పడుకున్నారా. ఈ వేళనుంచి అలా చేయడానికి వీలులేదు. మాకోసం మీరు ఇబ్బంది పడడానికి నే నొప్పుకోను. ఈ రాత్రి మీకూ మా నాన్నకూ ఎదరగదిలో పక్క వేస్తాను. నేనూ, మా రామం లోపల వంటగదిలో పడుకుంటాము" "అలాగే చేద్దురుగానిలెండి" అన్నాడు మూర్తి. ముగ్గురూ ఇంటికి చేరారు.

వెంకటప్పయ్యగారు నిద్రపోకుండా వాళ్ళకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు. కూతురు వస్తుంది, వచ్చాడని చెపుతుంది, మర్నాడే పెళ్ళిమాటలు మాట్లాడాలి అనే ఉత్సాహంతో ఉన్నారాయన. "ఏం, అమ్మాయి అతన్ని చూసిందా, నాయనా" అని ప్రశ్నించారు మూర్తిని. "ఆ, చూసిందండీ" అన్నాడతను. "ఎలా ఉన్నాడంది" అని అడిగారు, "మీరే అడగండి" అన్నాడు మూర్తి. "ఏమే అమ్మాయీ, ఎలా ఉన్నాడు, నచ్చాడా?" అని అడిగారు కూతుర్ని. కాని కాంతం మాట్లాడలేదు. వెంకటప్పయ్యగారు కూతురిచేత ఊఁ అనిపించాలనే ఆత్రంతో "బాగా ఉన్నాడు కదూ" అన్నారు. "అఁ, బాగానే

ఉన్నాడు - ఎత్తుపళ్ళూ, పిల్లికళ్ళూ, రాగి జుట్టూ—" అంటూ ముక్కు ముడుచుకుంది కాంతం. వెంకటప్పయ్యగారు నోరు తెరచుకొని అలాగే ఉండిపోయారు ప్రతిమలా. మూర్తి కాంతానికి సుందరరావు నచ్చలేదని ఇదివరకే గ్రహించాడు కాని, ఆమె ఇంతలా వర్ణిస్తుందనీ, ఇంతలా అసహ్యించుకుంటుందనీ ఊహించలేకపోయాడు. అతను గుర్తించనేలేదు సుందరరావుకు ఎత్తుపళ్ళూ, పిల్లికళ్ళూ, రాగిజుట్టూ మొదలైనవి ఉన్నాయని. కాంతం ఇట్టే పరిశీలించివేసింది. కాంతం చెప్పినతర్వాత సుందరరావుకు అవి అన్నీ ఉన్నట్లు జ్ఞాపకం వచ్చింది అతనికి. వీరిద్దరూ ఇలా ఆశ్చర్యంలో మునిగిపోయి ఉండగా రామం ముందుకు వచ్చి "అక్కయ్యా, పురాణ వ్యక్తు"ల్ని చాలామందిని గుర్తుపట్టావు నీవు. కాని కిష్కింధాపుర ప్రముఖులందరినీ చూసింపలేదు నీవు. ఈ సుందరరావుగారిని కూడా వారిలో —" అంటూంటే వెంకటప్పయ్యగారు "నువ్వు నోరు మూసుకు కూర్చో, వెధవా" అంటూ విరుచుకుపడ్డారు. తండ్రికోపం చూసి చల్లగా వెనక్కి తప్పుకున్నాడు రామం. వెంకటప్పయ్యగారు తీవ్రంగా అన్నారు: ఏమైనా సరే ఇదే నేను చూసే ఆఖరి సంబంధం. చేసుకుంటే ఇదే లేకపోతే మరొకటి నేను చూడను." కాంతం తల ఎత్తకుండా బింకంగానే అంది: "నేనీ సంబంధం వచ్చినా చేసుకోను." ఆ సమాధానం విని వెంకటప్పయ్యగారు ఆగ్రహావేశంతో కొంతసేపు మాట్లాడలేకపోయారు. గుడ్లతో మింగేటట్లు చూడసాగారు. కొంతసేపటికి కొంత కోపం అణచుకొని అన్నారు: "ఇంతకన్న మంచి సంబంధం ఎక్కడ దొరుకుతుంది? ఏం, నాయనా, నీవేమంటావు?" అని మూర్తివైపుకు తిరిగి ప్రశ్నించారు. మూర్తి కొంచెంసేపు ఆలోచించి, ఒకసారి కాంతం వైపుచూసి మెల్లగా అన్నాడు: "ఏమో, నాకు ఈ సంబంధం బాగానే ఉన్నట్లు తోస్తోంది. మిగిలిన అన్నివిషయాలూ మీ అమ్మాయి కోరినట్లుగానే ఉన్నాయికదా. అందంలో మాత్రం నాకేమంత అనాకారిగా కన్పించలేదు. కొంచెం పళ్లుఎత్తుఉన్నా, కళ్ళు లేతకరంగుగాఉన్నా అంత వికృతంగా ఏమీ కనిపించడంలేదే. అసలు ఏలోటూలేని వాని నెవరుంటాడు" మూర్తి తండ్రిని సమర్థించడంచూసి కాంతం పెదవి కొరుకుకుంటూ చేతిలో మేగజైను కాగితాలు విసురుగా తిరగవేస్తోంది. మూర్తి మాటలు విని వెంకటప్పయ్యగారు ఆనందంతో పొంగిపోతూ "బాగా చెప్పావు నాయనా. నిక్షేపంలా ఉన్నవాడికికూడా వంకలా? దీనివరసచూస్తే ఆఖరికి ఇంద్రుడికి కూడా వేలువంకలు పెట్టేటట్లుంది. అందం ఉండీ, అన్నీఉన్నవాడు పదివేలకు తక్కువ తీసుకుంటాడా. ప్రతిదానికీ రాజకుమారుడు కావాలని ఉంటుంది. కాని జరగవద్దూ" అన్నారు. కాంతం కనుబొమలు చిట్లించుకొని అలాగే కూర్చుంది. మూర్తి కాంతంకేసి తిరిగి "పోనీ మీరు పెళ్ళి చేసుకోవాలనిలేదా చెప్పండి. చదువు చదివి ఏఉద్యోగమైనా చేయాలనిఉంటే అలా చెప్పండి. అప్పుడు మీ నాన్నగారు బాధపడవలసినపనే ఉండదు" అన్నాడు. వెంకటప్పయ్యగారు కాంతం మాట్లాడకముందే కూతురు తనమాట కాదంటోందన్న కోపంతో వెటకారంగా అన్నారు. "ఆ, ఉద్యోగం చేస్తుంది ఉద్యోగం! ఇంటర్ మీడియేట్ చదవడమే గగనమైతే. రెండుసార్లు పరీక్షకు వెళ్లి వచ్చి పాడి తెలుగు పాసయింది. ఇక ఈవిడ పెద్ద చదువులు చదువుతుందీ -

ఉద్యోగం చేస్తుందీను!" రామం మళ్ళీ ముందుకు వచ్చాడు: "అది కాదులే నాన్నా. అక్కయ్య నాకోసమని ఆగిందిలే. పాసవలేక కాదు. నేనూ అక్కయ్యా ఒక్కసారే ఇంటర్ మీడియేట్ పాసవుతాంలే" అంటూండగానే కాంతం కోపం పట్టలేక "మహా నువ్వే తెలివిగలవాడవు లేవోయ్" అంటూ జుట్టుపట్టుకొని రామాన్ని వెనక్కి లాగేసింది. వెంకటప్పయ్యగారు మూర్తితో అన్నారు" "పోనీ అందగాడి నేచూసి పెళ్ళి చేసుకోమంటే కేవలం అందం చాలదట. బి. ఇ., ఎం. బి. బి ఎస్సో కావాలట. ఆస్తి కావాలట. ఈ గొంతెమ్మకోర్కెలకేమన్నా అర్థం ఉందా అని. దీనిపై వాళ్ళిద్దరూ ఇలాంటివేమీ కోరలేదు. నేను చేసినట్లు చేసుకున్నారు. సుఖంగా సంసారాలు చేస్తున్నారు. ఇక ఇలా కాదు. రేపు పొద్దున్నే వెళ్ళి వాళ్ళతో మాట్లాడి వస్తాను. వాళ్ళు తప్పక సుసుఖంగా ఉంటారని నా పూర్తి నమ్మకం." మూర్తి "అలా చేస్తేనే బాగుంటుందిలెండి. చిన్నవాళ్లు ఒక్కొక్కప్పుడు అర్థంలేని ఎన్నడూ నెరవేరని ఆశలు పెట్టుకుంటారు. అటువంటప్పుడు వాళ్లను సరియైనదారిలో పెట్టడం న్యాయమే లెండి" అన్నాడు పెద్దమనిషి తరహాగా. కాంతం ఈ వాదాన్ని త్రోసి పారేసేందుకన్నట్లుగా "నేనీసంబంధం చేసుకోను, చేసుకోను" అంది గట్టిగా. వెంకటప్పయ్యగారు మళ్ళీ నిలువెత్తున లేచారు. "చేసుకోవు! చేసుకోవు! చేసుకోక ఏంజేస్తావో చూస్తానుగా" అని అరిచారు. కాంతం అక్కడ ఉండలేక వడివడిగాపోయి మంచంమీద బోరగిలపడి మొగం తలగడలో దాచుకుంది. మూర్తి బయటికిపోవడానికి లేచాడు. కాంతం కదలలేదు. మూర్తి బయటికివచ్చి స్నేహితుడింటికి వెళ్లిపోయాడు.

పొద్దున్న ఇంటికి వచ్చాడు. కాంతం మాత్రం లేవలేదు. మూర్తి స్నానాది కృత్యాలు పూర్తిచేసుకొని ఏదో పుస్తకం చదువుకోసాగాడు. అప్పటికీ కాంతం లేవలేదు. ఇలాగే కూర్చుంటే వేళకు నోట్లో మెతుకులుపడవని గ్రహించి రామాన్ని పిలిచి "రావోయ్ రామం మనమిద్దరమే వంట చేదాం, మరేంజేస్తాం?" అంటూ వంటింటిలోకి దారితీశాడు. కాంతం ఒక్కసారిగా జేవురించిన మొగంతో విసురుగా వచ్చి "మీరిక్కడనుంచి వడవండి" అని చెప్పి స్నానం చేసివచ్చి వంట మొదలుపెట్టింది, బ్రతికాం రాబాబూ అనుకుంటూ మూర్తి ఒకమారు స్నేహితుని యింటికి పోదామని బయలుదేరాడు. వెంకటప్పయ్యగారు దొడ్లో ఎండలో కూర్చొని భగవద్గీత పఠిస్తున్నారు.

మూర్తి వెళ్లిన మరికొంతసేపటికి అతని తండ్రి రాఘవయ్యగారు రైలునుంచి దిగారు. సరాసరి కొడుకు ఇంటికి నడచి వచ్చారు. తిన్నగా లోపలికి ప్రవేశించారు. రామం మంచంమీద పడుకొని ఏవో బొమ్మల మేగజైను చూస్తున్నాడు. కాంతం వంటింట్లో తిరుగుతోంది. ఎవరూ రాఘవయ్యగారి రాకను గమనించలేదు. రాఘవయ్యగారు కొడుకు యింట్లో కొత్త వాళ్లనిచూసి కంగారుగా వెనక్కి వీథిలోకి పరుగెత్తారు. "ఇదేమిటి వీడిల్లు మారాడా ఏమిటి చెప్మా! ఉత్తరమేనా రాశాడు కాదు" అనుకున్నారు. ఒకరిద్దరిని అడిగారు మూర్తి ఎక్కడకు మారాడని. "ఎక్కడకూ మారలేదు. పాత ఇంట్లోనే ఉంటున్నారే" అన్నారు వాళ్లు. రాఘవయ్యగారు ఏమీ అర్థంకాక సందేహిస్తూనే మెల్లగా ఇంటిగుమ్మం మెట్లెక్కసాగారు. కాంతాన్నిచూసి మళ్ళీ గడపదగ్గర ఆగిపోయారు. కాంతం ఆయన్నిచూసి "ఎవరికోసం వచ్చారు" అని అడిగింది. "గోపాలకృష్ణమూర్తి-" అంటూ అస్పష్టంగా అన్నారాయన. "ఇప్పుడే ఎక్కడికో వెళ్ళారండి కాసేపటిలో వస్తారు. మీరు కూర్చుంటారా, మళ్ళీ వస్తారా" అని అడిగింది కాంతం స్పష్టంగా చదువుకున్నది కాబట్టి. రాఘవయ్యగారి మనస్సులో క్షణంలోనే వేయి అనుమానాలు బయలుదేరాయి. "ఎవరీమె? తన కొడుకు ఇంట్లో ఎందుకుంది? ఇంత ధాటీగా జవాబు చెప్తోంది" అని ఆశ్చర్యంతో అనుమానంతో మాట్లాడలేక వెనక్కి తిరిగారు. మూర్తి కనుపించాడు. ఆయన ఆశ్చర్యంనుంచి తేరుకొని అతన్ని అడిగేలోగానే మూర్తి "ఎప్పుడొచ్చావు, నాన్నా" అంటూ లోపలికి నడిచి వెంకటప్పయ్యగారిని పిలిచి ఆయనను గురించి చెప్పాడు. రాఘవయ్యగారి గుండె తేలికయింది. ఎంత పొరబాటువును! అదృష్టవశాత్తూ నాలుక జారలేదుకాని!" అనుకున్నారు. వెంకటప్పయ్యగారు "మీరు రావడం చాలా సంతోషం కలిగించింది. మీ అబ్బాయి మాకు దేవుడిలా దొరికాడు. చుట్టాలకన్న ఎక్కువ తోడ్పడుతున్నాడు. లేకపోతే మేమెన్ని ఇబ్బందులు పడవలసి వచ్చునో—ఇంతకీ మీరు వచ్చినపని?" అని ప్రశ్న వేశారు. "ఏముందండీ, వీడి భార్యపోయి నాలుగేళ్లయింది. అది బ్రతికున్నాళ్లూ తను సుఖపడలేదు, వాడినీ సుఖపెట్టలేదు. ఆ అనుభవంతో వీడు మళ్లీ పెళ్ళే చేసుకోనంటున్నాడు. ఎన్నో సంబంధాలు వస్తున్నాయి. ఎన్ని వచ్చినా ఒప్పుకోవడంలేదు. కాని వాడిలా ఉండిపోతే మేమెలా ఊరుకోగలమండీ. బెంగతో తల్లడిలిపోతున్నాం, ఎలాగో వాణ్ణి ఒప్పించి పెళ్లిచేద్దామని వచ్చానండి" అని చెప్పారు రాఘవయ్యగారు. ఇంకేముంది, ఇద్దరూ ఒకేస్థితిలో ఉన్నారు; ఒకరి కష్టసుఖాలొకరు చెప్పుకుని పదినిమిషాలలో ప్రాణస్నేహితులయిపోయారు వెంకటప్పయ్యగారూ, రాఘవయ్యగారూను.

భోజనాలదగ్గర వెంకటప్పయ్యగారు మూర్తిని ప్రశ్నించారు "ఏం నాయనా, మూర్తీ. మీ నాన్నగారు వచ్చారు. మరి ఏమంటావు? మీ నాన్నగారు చెప్పిన సంబంధం నా దృష్టిలో అన్నివిధాలా బాగానే ఉన్నట్లుంది. దానికి నీ అభ్యంతరమేమిటి?" "ఏమీ లేదండి. పెళ్లిచేసుకోదలచలేదంతే" నన్నాడు మూర్తి. కాంతానికి మూర్తిమీద తిరుగుదెబ్బ కొట్టడానికి అవకాశం కనిపించింది. "నా విషయంలో ఇంతకుముందు ఏవేవో చెప్పారే. ఇప్పుడు మీ విషయంలో ఏం చెప్తారు?" అని అడిగింది. "నేను సంబంధం విషయం కాదు, చెపుతున్నది. పెళ్లిచేసుకోవడమేవస్తే ఈ సంబంధమే చేసుకోవచ్చు. ఇదే కాదు మరే సంబంధమైనా మా అమ్మకీ, నాన్నకీ నచ్చి చేసుకోమంటే చేసుకుంటాను. కాని నాకు అసలు వివాహం చేసుకోవాలనే ఉత్సాహం లేదని నేను చెపుతున్నాను" అన్నాడు మూర్తి బాధతో ఏవో వెనకటి అనుభవాలు స్మరించుకుంటూ. "ఇప్పటినుంచీ నీకీ వైరాగ్యమేమిటి నాయనా? అన్నివిధాలా నీవు ఇంకా చాలా అనుభవించవలసినవాడవు, అనుభవించగలవాడవు కూడాను. ఎవరో ఒక్కరివల్ల ఏదో బాధ కల్గిందని, అందరివల్లా అదే బాధ కలుగుతుందనుకోకూడదు నాయనా, అసలు మానవుడి జీవితం సుఖదుఃఖాల కలయిక నాయనా, మానవుడెప్పుడూ ఆశతో జీవిస్తాడు. వెనకటి కష్టాల్ని మరిచి కొత్త సుఖాలకోసం ప్రయత్నిస్తూనే ఉంటాడు. లేకపోతే ఈ లోకంలో బ్రతుకే దుష్కరమవుతుంది

నాయనా. అందువల్ల వైరాగ్యం వదిలి నలుగురికీ ఆనందకరమైన పని చేయి, నాయనా" అంటూ కొంచెం వేదాంత ధోరణిలో మాట్లాడి రాఘవయ్యగారివైపుకు తిరిగి "మీ వాడికి మీరు చెప్పిన సంబంధం విషయంలో అభ్యంతరమేమీ లేదని చెపుతూనే ఉన్నాడుగదా. ఇక మీరేమీ చింత పెట్టుకోక ఆ సంబంధమే స్థిరపరచివేయండి" అన్నారు. కాంతానికి మూర్తిమీద మళ్ళీ తిరుగుదెబ్బ కొట్టేందుకు అవకాశం కనిపించి "అవునండీ, అలాగే చేసివేయండి. ఇప్పుడు ఇలా ఉన్నా కొన్నాళ్ళకు ఆయన మనస్సు అదే మారుతుంది లెండి" అంది. మూర్తి మాత్రం తన పట్టు విడువలేదు. "లాభం లేదు నాన్నా. నాకోసం నీవేమీ ప్రయత్నం చేయకు" అన్నాడు మెల్లగా. "లాభం లేదేమిట్రా? మీ అమ్మ నీకోసం ఎంత బెంగపెట్టుకుందో తెలుసా. అస్తమానూ నిన్ను తలచుకుంటూ ఏడుస్తోంది. నాకు మాత్రం ఏం సంతోషం ఉంటుంది నీవిలా ఉంటే. కోదండరావు అదే పనిగా బతిమాలుతున్నాడు తన కూతుర్ని చేసుకోమని. మన మేదో బెట్టు సరి చేస్తున్నామని కూడా అనుకొని ఇంకో ఐదు వందలు ఇస్తాననికూడా అంటున్నాడు" అని రాఘవయ్యగారు చెపుతూంటే వెంకటప్పయ్యగారు ఆయన నాపి "ఎందుకండీ వీళ్ళతో ఇంతగా చెప్పడం. మా కాంతం కూడా ఇలాగే పెంకెతనం చేస్తోందిగదా. అయినా ఇపుడు వెళ్ళి ఆ సంబంధంవారితో మాట్లాడి అన్నీ స్థిరపరచి వేయాలనుకుంటున్నాను. మీరూ అలాగే చేసివేయండి. మీ వాడికి కొత్త పెళ్ళాం మొగం కనిపించేటప్పటికి ఎక్కడి వైరాగ్యం అక్కడికే మాయమవుతుంది లెండి" అంటూ నవ్వి "భోజనం చేసిన తర్వాత ఇద్దరం అలా పోయి అన్నీ ఆలోచించుకుందాం. ఆపైన నేను చెప్పిన మా అమ్మాయి సంబంధం వారి ఇంటికి వెళ్లివద్దాం" అన్నారు. "అలాగే" నన్నారు రాఘవయ్యగారు. ఇద్దరూ భోజనం చేసి బజారువైపుకు బయలుదేరారు. మూర్తి మొగం చిట్లించుకొని త్వరత్వరగా ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

సాయంత్రం అతను తిరిగివచ్చిన కొద్దిసేపటికే వెంకటప్పయ్యగారూ రాఘవయ్యగారూ వచ్చారు. కూడా ఒక బ్రాహ్మడు ఉన్నాడు. ముగ్గురూ కూర్చొని పంచాంగం తిరగవేసి వివాహ ముహూర్తాలు చూడసాగారు. కాంతం తన ఇష్టానికి వ్యతిరేకంగానే తనభవిష్యత్తు నిశ్చయం కాబోతోందని విచారంగా చూస్తూ కూర్చుంది. మూర్తి కూడా కొద్దిరోజుల్లో తనకు కూడా అలాగే అవుతుందని తలచుకుంటూ విచారంగా కూర్చొని చూస్తున్నాడు. ముహూర్తాలు చాలా చూశారు. ఆఖరికి ఒకటి బాగా కనిపించింది "బాగుంది కాని పదిహేను రోజులే వ్యవధి. నేనైతే ఆ వ్యవధిలోనే అన్నీ చేసివేసుకోగలను నాకు పలికేవాళ్లు చాలామంది ఉన్నారు" అన్నారు రాఘవయ్యగారు. "నాకూ ఉన్నారండి. పదిహేను రోజులు దివ్యంగా సరిపోతాయండి." అంటూ బ్రాహ్మడు గొణగడం చూసి తాంబూలం అరటిపండూ తీసుకొని "మరి మళ్లీ ముహూర్తం దాటిపోతుంది ఇది తీసుకోండి బావగారూ" అంటూ వెంకటప్పయ్యగారు తాంబూలం రాఘవయ్యగారి చేతిలో పెట్టారు. మరొక తాంబూలం తీసుకొని మూర్తివైపుకు చేయి చాపారు. కాంతం, మూర్తి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. మళ్ళీ చటుక్కున ఒకరిమొగా లొకరు చూసుకున్నారు. కాంతం మూర్తి కళ్ళలోకి ఒక క్షణం చూసి ఇట్టే సిగ్గు దొంతరలలో మునిగిపోయి, చీరకొంగు నోట్లో పెట్టుకొని తల వంచుకొని వంటింట్లోకి పరుగెత్తింది. మూర్తి ఇంకా ఆశ్చర్యంనుంచి తేరుకోలేదు. అంతలోనే అతను అపుకుందామన్నా ఆగక చిరునవ్వు అతని మొగమంతటా వెన్నెల ప్రాకినట్లు ప్రాకిపోయింది. రామం హుషారుగా గంతులేశాడు: "బలే, మామయ్యవల్లా బావయ్యావు! బాగుంది! ఇక నేను కూడా మీతోనే మకాం. వచ్చే యేడు ఈ ఊరి కాలేజీల్లోనే చేరుతాను. నాకీ ఊరునచ్చింది" అన్నాడు సంతోషం పట్టలేక. ★




# భార్యలు బానిసలా? 

"మీరెప్పుడూ మాయింటికి రారు. అంత తీరిక లేకుండా ఏంచేస్తారమ్మా పగలంతా?" అంటుంది అన్నపూర్ణమ్మ సరళ ఎప్పుడు కనబడ్డా.

"నలుగురు పిల్లలుగలయిల్లండీ మాది. ఏదో ఒకపని సరిపోతూ ఉంటుంది" అని సరళ నవ్వుతుంది.

"నీకేనా పిల్లలు – మాకు లేరా? మా యింట్లోనూ ఏడుగురు పిల్లలున్నారు. అయినా నేను మధ్యాహ్నపువేళ సాయంత్రపువేళ ఊరికేనే ఉంటానే! మధ్యాహ్నము ఏమీతోచక అట్లా ఎవరింటికయినా తిరిగికూడా వస్తాను"

ఆమాటలకు సరళ నవ్వుతుంది.

ఉదయము తొమ్మిదిగంట లయ్యేసరికి సరళయింట్లో పిల్లలస్నానాలు భోజనాలు అయిపోతాయి. అందరూ స్కూలుకు వెళ్ళిపోతారు. ఆతరువాత మరోగంటకు పెనిమిటిని ఆఫీసుకు పంపిస్తుంది. అంతా వెళ్ళిపోయినతరువాత ఉదయము తొందరపాటున తీసి పడవేసినసామానులన్నీ సర్దుకొని భోజనము చేస్తుంది. పగటివేళ ఆ నలుగురుపిల్లలలో ఎవరివో ఒకరివి బట్టలు రిపేరు చేయవలసే వస్తుంది. అది కాకపోతే, పెనిమిటి కోట్లకో ప్యాంట్లకో గుండీలు కుట్టవలసే ఉంటుంది. వాటిపని అయినతరువాత ఆ క్రిందటిదినము సబ్బుతో శుభ్రముగా ఉతికి గంజిపెట్టినబట్టలను ఇస్త్రీ చేయవలసి ఉంటుంది. ఈపనులు ముగించుకొని గడియారము చూస్తే మూడుదాటి ఉంటుంది. అప్పుడామె ఏదో ఆలోచించి చిరుతిండి కాఫీ తయారుచేసి పిల్లలకోరకు ఎదురుచూస్తుంది. పెనిమిటి ఒకగంట ఆలస్యంగా వస్తాడు. ఈలోపల పిల్లలు రావటము, తల్లి పెట్టినది

## ఇల్లిందల సరస్వతీదేవి

తినటము, జరుగుతుంది. పిల్లలలో ఆడుకొనే పిల్లలు ఆడుకొంటే పెద్దపిల్లలు కాస్త తల్లి దగ్గరచేరి, ఆమె చేసేపనిలో సహాయపడుతూ ఉంటారు. అందరూ కలిసి గబగబా వంటచేసి అక్కడ పెట్టుకొంటారు. ఆయన వచ్చేసరికల్లా అందరూ తీరికగా ఉంటారు. కాఫీ ఫలహారము అవుతుంది. తల్లీ దండ్రీ కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవటమో లేక ఎక్కడికయినా వెళ్ళటమో అప్పుడప్పుడు ఉండనే ఉంటుంది. పిల్లలు ఎవరిపనులలో వాళ్ళు నిమగ్నులవుతారు. తల్లీ తండ్రీ ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు పిల్లలకేమి చెప్పిపోతారో – అంతే.

నిజానికి సరళ పెనిమిటి తెచ్చేది రెండువందలకు పైన మూడువందలకు లోపు. అయినా చూసినవాళ్ళు ఏ అయిదారువందలు వస్తాయో ననుకుంటారు. దానికి కారణము సరళ పిల్లలు ఇస్త్రీ బట్టలు వేసుకుంటారు. పేరంటాలకు పార్టీలకు అందరిలాగే మంచిబట్టలు డాబుగా కట్టుకుంటారు. లెక్కగా మూడునాలుగు జతలున్నా ఎన్నో ఉన్నట్టుగా వాడుకుంటారు. ఆయనైనా ఎప్పుడూ వేసుకొనేవి రెండుమూడు సూట్లయినా నలగనివీ మాయనివీ వేసుకొంటాడు. పిల్లలుగల యింట్లో ఇంతశుభ్రత బట్టలలో చూపించాలంటే పట్టణాలలో నెలకు పాతికరూపాయలైనా ఖర్చుపెట్టవలసే వస్తుంది. కాని సరళ నిజానికి బట్టల క్రింద ఆరు ఏడు రూపాయలుకూడా ఖర్చుపెట్టదు. సబ్బుపొడి నీలిమందు కొంటుంది. ఒక పండుగకు ఆయన చీరె కొనిపెట్టానంటే ఒక ఇస్త్రీపెట్టె కొనియివ్వమన్నది. రోజూ వరినూకలతో గంజితీస్తుంది. మసిలే నీళ్ళలో సబ్బు చూరవేసి బట్టలను నానబెట్టుతుంది. కొన్నిగంటలు నానినతరువాత ఎక్కువ శ్రమలేకుండా ఉదికి నీలిమందు నీళ్లల్లో జాడించుతుంది. ఆ తరువాత గంజి పెట్టుతుంది. ఆ చిన్నయింట్లోనే ఈ మూల నుంచి ఆమూలవరకూ తాడుకట్టి ఈ బట్ట

లన్నీ ఆరవేస్తుంది. ఆరగానే తీసి మడతలు పెట్టి తాను విప్పి భద్రపరుస్తుంది.

పిల్లలుగల యిల్లని వాయిదాలమీద బట్టలు కుట్టే మిషనుకొన్నది. పిల్లలవి పెద్దలవి బట్టలు చేతనయినమటుకు ఆమె, పిల్లలు కుట్టిపడవేస్తారు

సరళకు యూనివర్సిటీ డిగ్రీలు లేవు. శాస్త్రీయమైన చర్చలలో పాల్గొనలేదేమో గాని వార్తాపత్రికలు చదువుతుంది: అర్థము చేసుకొనగలుగుతుంది. హిందీ తెలుగు ఇంగ్లీషు భాషలలో చక్కగా మాట్లాడ గలదు.

# ★ భార్యలు బానిసలా? ★

సరళకు ఆరోగ్యము సరిగా లేనినాడు ఆయన, పిల్లలు యింట్లోనే ఉంటారు. పని అందరూ కలిసి చేసుకుంటారు. సరళ యింట్లో అందరూ పనిచేయగలవారే. వాళ్ళ యింటినిచూస్తే సహకారసంస్థగా కనబడుతుంది. వాళ్ళయింట్లో పనిచేసుకోవటానికి ఎవరూ బిడియపడరు. న్యూనతగా భావించరు. ఒకరికొకరు లోకువ అని అనుకోరు. కాగా తమపని తాము చేసుకోగలుగుతున్నామని తృప్తిగా ఉంటారు.

కాని ఇరుగుపొరుగు ఆ యింటినిగురించి చాలా విచిత్రముగా చెప్పుకొంటారు. సరళ పెనిమిటి ఆమెను ఎక్కడికీ వెళ్ళనీయడనీ ఆమెచేత బానిస చాకిరీ చేయిస్తున్నాడనీ, చాకలికి బట్టలన్నా వెయ్యనివ్వడనీ అనుకుంటారు. "అన్ని పనులకూ నౌకరులను పెట్టకూడదా - ఆమెను గౌరవముగా చూడకూడదా" అని నవ్వుకుంటారు.

కాని సరళను చూసినవ్వీన అన్నపూర్ణమ్మ గారియింట్లో ఆ మగువ పనే కనపడదు. పెనిమిటి తెచ్చిన నాలుగువందలలో పాతిక రూపాయలు చాకలివాడికి పోతాయి. కాని పిల్లలు ఎప్పుడూ మాసినవీ ముడుచుకొనిపోయినవీ గుండీలుపోయినవీ వేసుకుంటారు. బట్టలు ఎప్పుడూ కొంటూనే ఉంటారు గాని ఎక్కడికయినా వెళ్ళాలంటే వేసుకోవటానికి ఏమీ కనపడవు. చేతి క్రింద నౌకరులను పెట్టుకుంటుంది గాని ఏ పనీ వేళకు కాదు. పిల్లలు పెద్దలు ఇబ్బంది పడుతూంటారు. బట్టలు మాపినవి మాసినట్టు బుట్టలో పెట్టి మూతవేస్తారు. ఆ చాకలి పదిరోజులకొకసారి రావాలి, ఆ మూత తెరవాలి.

నాలుగు గదులూ వసారా ఉన్నా యింట్లో కూర్చోటానికి చోటు ఉండదు. అన్నీ సామానుగదులుగానూ అన్నీ పడకగదులుగానూ కనబడతాయి. ఇంకా పెద్ద ఇల్లయితే గాని శుభ్రముగా పెట్టుకోవటానికి వీలుగా ఉండదంటుంది.

అయితే అన్నపూర్ణమ్మ స్వాతంత్ర్యాన్ని గురించి చర్చించినట్లుగా మరొకరు చర్చించలేరు. సమాజ సేవను గురించి వాదించినట్లు మరొకరు వాదించలేరు. స్త్రీ పురుషులలో ఎవరు అధికులో ఆమె ఉపన్యసించినట్లు మరొకరు ఉపన్యసించలేరు. ఆమె అనేది ఏమిటంటే 'పురుషుడు స్త్రీచేత యింట్లో చాకిరి చేయించకపోతే నౌకరులను పెట్టుకోకూడదూ? ఆమెను ఈ కాలములోకూడా బానిసలాగే చూడాలా?' అని.

కుటుంబమొక సహకారసంస్థ. దానిలో నివసించే వారందరు సహకార సభ్యులవంటివారు. సమానగౌరవమూ సమానాధికారమూ గలవారు. ఎవరికి చేతనైన పని, ఎవరికి వీలుగా ఉన్న పని వారు చేయవలసినదే. ఆ సంస్థలో ఎవరయినా ఊరికే సోమరిపోతులవలె కూర్చోటము ఆ సంస్థయొక్క అభ్యుదయానికి భంగకరము. భార్యాభర్తలు ఒకరికొకరు గౌరవనీయులు. ఒకరికొకరు అధికారులు. శాస్త్రాలుకూడా ఈమాటను ఒప్పుకొన్నాయి. మహేశ్వరుడుకూడా దీనిని కాదనలేదు; కాగా పెనిమిటిని మంచి మార్గాన పెట్టే అధికారముకూడా భార్యకే ఒప్పగించాడు. భార్యాభర్తలిద్దరూ ఒకరికొకరు కావలసినంత చాకిరి చేసుకోవచ్చు. ఒకరికొకరు ఎంత గౌరవనీయులో అంత బానిసలు. ఆ సందర్భములో పురుషుడు చాకిరి చేయించేవాడు స్త్రీ చాకిరి చేసేది అన్న భావము ఉండకూడదు—ఉండదు—ఉంటే దానిని నశింపచేయాలి. ఒక యింటిలో ఒకరికోసం ఒకరు చేసుకొనే పనులలో స్వామిభృత్యభావము ఎంతమాత్రము ఉదయించకూడదు.

పనులలో అనేకరకాల సంబంధాలతో అనేక భావాలతో చేసేవి ఉంటాయి. పెద్దవాళ్ళకు చిన్నవాళ్లు భక్తిగౌరవాలతో, ప్రేమాభిమానాలతో సేవచేస్తారు. తలిదండ్రులకు వృద్ధాప్యంలో బిడ్డలు సేవచేయుటములో ఇమిడిఉన్న భావము ఇదే.

తలిదండ్రులు తమ బిడ్డలకొరకు కష్టపడటము ఒకరి మెప్పులకొరకు కాదు; అది బానిస చాకిరీ అంతకంటె

కాదు. పసిబిడ్డలకొరకు, తల్లి అహో రాత్రాలు కష్టించటానికి మలమూత్రాలను కడిగి శుభ్రపరచడానికి కారణము ఆ బిడ్డల మీద ఆమెకు గల ప్రేమే. వృద్ధాప్య ములో ఆ సంతానమే ఆమెకు సహకరించ టములో అసహజములేదు. ఇదికూడా సహ కారభావమునే స్ఫురింపచేస్తున్నది.

రోగికి పరిచర్య చేయటములో నర్సు కున్న భావము బానిస భావము కాదు. అసహాయుడు బాధపడుతున్నాడనే జాలి సానుభూతితో చేసేసేవ అది. ఆమె సేవా భావముతో, ఉద్యోగరీత్యా, బాధపడే వారికి జాలితో పరిచర్యచేస్తుంది. ఆమె వృత్తిని న్యూనతగా భావించ నవసరము లేదు. అది గౌరవనీయమైన వృత్తులలో ఒకటి.

ఎవరింటిపనులు వారు చేతనయినంత వరకు చేసుకోవటాన్ని న్యూనతగా భావిం చటము అభ్యుదయకరము కాదని మనదేశ ములో ప్రబోధము చేసిన వ్యక్తి గాంధీమహా త్ముడు. సబర్మతీ ఆశ్రమవాసులందరూ ఎవ రికి నియమింపబడిన విధులను బాధ్యతలను వారు నిర్వర్తింపవలసినదే. పనిచేయనివారు అక్కడ నివసించటానికి వీలులేదు. పని చేయటములో ఉన్న గౌరవ స్వాతం త్ర్యములను గురించి ఆయన తీరినప్పుడు ఆశ్రమవాసులకు ఉపన్యసించుతూ ఉండే వారు. హరిజన్, యంగిండియా పత్రికలలో వ్రాస్తూ ఉండేవారు:

అయినా మనదేశములో కష్టపడి పని చేసుకోవటము న్యూనతగానే యింకా భావి స్తున్నారు. అవకాశ మున్నంతవరకూ సేవ కులను నియమించుకొంటూనే ఉన్నారు.

విదేశాలలో ఇంటినౌకరుల సంఖ్య చాలా తగ్గిపోయింది. ఎవరింట పనులు వాళ్లే చేసు కొంటారు. సాటిమానవుడిచేత ఇంటిపను లను చేయించుకోవటము జాతి కవమానకర మని భావిస్తారు. సాటి మానవుడికి ఇంటి చాకిరిచేసి డబ్బు సంపాదించటము తనకు అగౌరవమని సామాన్యపౌరుడు భావిస్తాడు. అతడు ద్రవ్యార్జన మరొకవిధముగా చేస్తాడు.



అక్కడక్కడ ఇంటినౌకరులు లేకపోలేదు. వాళ్లు చాలా గౌరవముతో పనిచేసి వెళ్ళి పోతారు.

దురదృష్టవశముచేత మనదేశము అంతగా పారిశ్రామికముగా అభివృద్ధి చెందలేదు. ప్రజలకు గౌరవముతో జీవించటానికి అవ కాశాలు అంతగా లేవు. భుక్తికొరకు ఎంత నీచపుపనులకైనా సమ్మతించవలసివస్తున్నది. మనకు నిరంకుశత్వముపోయి ప్రజాస్వామి కము వచ్చినదనుకుంటున్నాముగాని అన్ని విషయాలలో రాలేదు. పౌరసత్వపుహక్కు లతోపాటు మానవుడికి గౌరవముగా బ్రత కటముకూడా జన్మహక్కన్న భావము మనలో ప్రబలము కావలసి ఉన్నది.

పూర్వము మనదేశములో రాజ్యము ఒక సహకారసంస్థగా ఉండేది. ఆ రాజ్యానికి దైవబలము సాధించడానికి సంఘానికి విద్యాబుద్ధులు గరపటానికి బ్రాహ్మణులు, భుజబలముతో సంఘాన్ని రక్షించటానికి క్షత్రియులు, వాణిజ్య వ్యాపారము చేసి ఆర్థిక సదుపాయాలను ఇనుమడింప చేయడా నికి వైశ్యులు, భూమిని సాగుబడిచేసి ఆహార ధాన్యాన్ని పండించడానికి రైతులు, బట్ట లను నేయడానికి సాలెవారు, అందరికీ పాత్రలను తయారుచేయడానికి కుమ్మరి కంచరి వృత్తులవారు ఇళ్లు కట్టేవారు, మంగలివారు, చాకలివారు ఇన్ని రకా లుగా, ఇన్ని వర్గాలుగా ఏర్పడి సహకార భావముతో సంఘాన్నీ రాజ్యాన్నీ పోషిం కొంటూ, రక్షించుకుంటూ ఉండేవారు. ఈ వృత్తులలో ఎవరి బాధ్యతలను వారు గౌరవముగా నిర్వర్తించుకొంటూ ఉండే వారు. ఈవిధముగానే సమిష్టి కుటుంబాలు కూడా సహకార సంస్థలుగా ఉండేవి.

ప్రస్తుతము మనకు సంఘములో గాని సమిష్టి కుటుంబములో గాని సహకారము మందుకైనా కనబడదు. సంస్థలు మాత్రము నామమాత్రముగా కనబడుతున్నాయి. సహ కారభావము నశించిపోవటముతో దేశము అరిష్టముల పాలయినదని చాలామంది అను భవజ్ఞుల అభిప్రాయము.

పైవిధముగా కుటుంబాలలో కూడా పర స్పర సహకారభావము నశించిపోవటము ఏమాత్రమూ శుభదాయకము కాదు. కుటుం బములో ఏ స్త్రీ అయినా తనవంతు కష్టము చేయనిదీ సదుపాయములు అనుభవించటము స్త్రీ స్వాతంత్ర్యానికి భంగమని తెలిసికో [illegible] చాలా ముఖ్యము.



 

# అలక



అలగటమూ ఒకకళే. అదీ అందరికీ రాదు. అలక నేర్చిన వ్యక్తులు జీవితములో ఎన్నో కార్యాలను సాధించగలరు. అలక అనగానే ఆడవాళ్లు గుర్తుకు వస్తారు. కన్నీరు, అలక ఆడవాళ్ల ఆయుధాలంటుంటారు. ఇందులో కొంత సత్యమున్నా అందరి ఆడవాళ్ళకు అలక చేతకాదంటే అందులో అతిశయోక్తి ఏమీ లేదు.

## వాసిరెడ్డి సీతాదేవి

అలకముదిరితే మొండిపట్టు, లేక హఠము క్రింద మారుతుంది. దీనివల్ల జీవితములో ఎన్నో అనర్థకాలు సంభవించవచ్చును. అలకకూ, హఠము (మొండిపట్టు)కూ సూక్ష్మమైన భేదమున్నది. దీన్ని తెలుసుకోలేకపోయినందువల్ల దాంపత్యజీవితాల్లో అశాంతి రేకెత్తే అవకాశముంది.

జీవితములో ప్రేమకున్న స్థానమే అలకకూ వుంటుంది. అలకద్వారా ప్రేమ వికసిస్తుంది. అలక ప్రేమలో మాధుర్యాన్నీ, క్రొత్తదనాన్ని ఉత్పన్నం చేస్తుంది. దీనివల్ల జీవితములో ఒవిధమైన ఆవేదన, ఆ ఆవేదనలో మాధుర్యము కలుగుతాయి.

అవిరామప్రయాణములో విసుగు చెందిన బాటసారి కొంచెంసేపు ఏచెట్టుక్రిందనో లేక

నాగపూజ

ఫొటో: డి. భీమారావు—హోలహర్వి.

సత్రంలోనో విశ్రాంతి తీసుకుంటాడు. ప్రేమమార్గంలో అలక ప్రేమజీవులకు ఒక విశ్రాంతిస్థానము. సేదదీరినబాటసారి మరల నూతనోత్సాహంతో, నూతనశక్తితో ప్రయాణము సాగిస్తాడు.

అలకలో ఒకవైపున అశాంతి, ఆవేదన, అసంతృప్తి వుంటే రెండోవైపున అభిమానంతో కూడిన ఆనందము తీయ్యనికోర్కెలు వుంటాయి. ప్రేమపూర్ణమైన అధికారమే అలక. ఎవరిమీద మనకు ప్రేమ, అధికారము వున్నాయనుకుంటామో, వారిమీదనే అలుగుతాము. పిల్లలనుండి వృద్ధులవరకేకాక పసువుల్లో సైతము యీ అలక కన్పిస్తుంది.

అలకతీర్చేవారూ, అభీష్టాన్ని నెరవేర్చేవారూ వున్నప్పుడే అలగటమంటూ జరుగుతుంది. తన అలకని లెక్క్యపెట్టేవారు లేనప్పుడు అలగటమంత తెలివితక్కువపని వేరేవుండదు. కళ్ళనీళ్ళు తుడిచేవారిముందే ఆకన్నీటికి విలువ వుంటుంది. అలాగే అలక తీర్చేవారూ, ఆ అలక తీరేంతవరకూ అశాంతితో బాధపడేవారూ వున్నప్పుడే ఆ అలకకూ విలువ వుంటుంది.

అలకలు ఎన్నో విధాలుగా వుంటాయి. కొంతమంది అలిగితే మాట్లాడటము మానివేస్తారు. కొంతమంది ఎవరిమీదనైతే అలక వహించారో వారియడల అయిష్టతను తెలియపరుస్తారు. కొంతమంది వారి సమక్షమునుండి దూరంగా పోతారు. కొంతమంది బహుమతులుగా యివ్వబడిన వస్తువులను తిరిగి యిచ్చివేసి తమ అలకను తెలియపరుస్తారు. ఇంకా కొంతమంది ఆభరణాలను, మంచి వస్త్రాలను త్యజించి, ఏ చింపిరిపాతలో ధరిస్తారు. ఇంకా యింట్లో అలంకరణకు వుంచిన వస్తువులను చిందరవందరగా పడేస్తారు. ఇలాంటి అలక సాధారణంగా ప్రబంధనాయికలలో కన్పిస్తుంది.

తెలివైనవారు యీ ఆయుధాన్ని, ఎప్పుడు, ఎక్కడ, ఎలా వుపయోగించాలో ఆలోచించి మరీ వుపయోగిస్తారు. చీటికి మాటికి అలిగే వారి అలకకు విలువే వుండదు.

అలకలో విరోధభావము వున్నా ఆగ్రహము (మొండిపట్టు) వుండదు. మొండిపట్టు ద్వేషానికీ, అవిశ్వాసానికీ, మనస్పర్థలకూ దారితీస్తుంది. రాజీపడటములోనే అలకరాణిస్తుంది. అందువల్ల, అలిగినవారు సరసం విరసంగా మారకుండా జాగ్రత్త పడాలి.

జీవితాన్నీ, ప్రేమనూ, రసవత్తరం చేయటానికి అలకఅవసరమే. కాని తమ ప్రేమపాత్రుల ప్రేమను, దౌర్బల్యాన్నీ ఆధారంగా తీసుకొని అనుచితమైన లాభాన్ని పొందటానికి ప్రయత్నించటము చాలా కష్టాలకు దారితీస్తుంది.

శ్రీకృష్ణుడు పదహారువేల మంది గోపికల్లో, ఏడుగురు భార్యల్లో చూడలేని ఏ ఆకర్షణ సత్యభామలో చూశాడో! చాలామంది సత్యభామ అపురూప సౌందర్యమే అతన్ని ఆకర్షించిందని భ్రమపడతారు. కాని సత్యభామ అలక నేర్చిన అతివ కావటమే అతని ఆకర్షణకు ఆధారభూతమైనది.

ఇంతమంది ప్రియురాండ్ర హృదయాల నుండి అవిరామంగా ప్రవహించే ప్రేమప్రవాహములో! ఉక్కిరిబిక్కిరయే శ్రీకృష్ణునకు సత్యభామ అలక విశ్రాంతిని యిచ్చేది. గోపికలు ప్రేమించటం మాత్రము నేర్చుకున్నారు. కాని ఆ ప్రేమను పాతపడనీయకుండా మధ్య మధ్య కొత్తదనాన్ని యివ్వగలిగే అలకను నేర్చుకోలేకపోయారు. యీ రహస్యాన్ని తెలుసుకున్న సత్యభామ శ్రీకృష్ణుని తన వానిగా చేసుకున్నది.

అలాగే అలక నేర్చిన కైకేయికి దశరథుడు దాసుడయాడు. గృహంలో ప్రవేశించి, ప్రవేశించకముందే పరిస్థితిని అర్థం చేసుకున్న దశరథుని హృదయం ఒకవైపు ఏదో అజ్ఞాతభయంతో, రెండోవైపు తియ్యని ఆలోచనలతో (ఆమె అలక ఎలా తీర్చాలా, అనే ఆలోచనలు) నిండిపోతుంది. కాని కైకేయి అలక, హఠముగా మారింది. చివరికి అది ఎన్నికష్టాలకు దారితీసిందో అందరికీ తెలిసిన విషయమే.

అలకద్వారా ఒక్కొక్కప్పుడు గడ్డు సమస్యలుకూడ ఒకదారికొస్తాయి. ఒకోసారి అకారణంగానే యిద్దరు స్నేహితుల మధ్యనో, ప్రియులమధ్యనో మనస్పర్థలు బయలుదేరి, ఒకరినొకరు విమర్శించుకోనేంతవరకూ, శత్రుత్వం వహించేంతవరకుకూడ పోతాయి. అలాంటివారికి యీ కళ తెలియదనే చెప్పాలి. ఇలాంటి సమయాల్లో ఒకరు అలిగికొద్దిరోజులు దూరంగా వెళ్లిపోవటం మంచిది. సావకాశంగా యిద్దరూ ఆలోచించుకొనే అవకాశం దొరుకుతుంది. యీవిధంగా తమతమ లోపాలను అర్థంచేసుకొని, పశ్చాత్తాపపడే అవకాశం దొరుకుతుంది. మరల ఒకర్నొకరు కలుసుకోవటానికి తహతహ పడతారు. యీ విధంగా, ఒకరినొకరు శత్రువులుగా భావించుకోవటం వరకూ పోయినవాళ్లు కూడ, మరల నూతనోత్సాహంతో, ఉద్వేగంతో కలుసుకొనే అవకాశం వుంటుంది.

గృహస్థ జీవితంలో భార్యాభర్తలు రాజీ మార్గాన్ని అనుసరించాలి. స్త్రీ, పురుషులు ఒకరినొకరు అర్థం చేసుకోగలిగినా, ఒకరి లోపాలనొకరు సానుభూతితో సహిస్తూ, తమతమ స్వతంత్ర భావాలను కొంతవరకు అదుపులో పెట్టుకోగలిగినప్పుడే దాంపత్య జీవితము ఏ ఒడిదుడుకులు లేకుండా సాఫీగా నడవగలదు.

దూరంగా వున్నంతవరకూ ప్రేమగానీ, స్నేహంగానీ కుతూహలంగానే వుంటుంది. కాని దగ్గరకు వచ్చినప్పుడే కొద్దిరోజుల్లోనే పరస్పరాకర్షణ తగ్గటం, ఒకరిని చూస్తే ఒకరికి చిరాకు ప్రారంభమవుతాయి. "టాల్‌స్టాయి" రచించిన నవల, "అన్నా" చదివిన వారికి అన్నా ఏ కారణంగా మానసిక బాధకు గురైందో, చివరకు ఆమె జీవితము దుఃఖాంత మెందుకయిందో తెలిసే వుంటుంది. దీనికంతకు ముఖ్యకారణము అన్నాకు అలగటము తెలియకపోవటమే.

మానవుడు సాధారణంగా తన ప్రేమ పాత్రులైనవారిలో అన్ని సద్గుణాలనీ, మంచితనాన్నే చూస్తాడు... చూడగోరతాడు. తన ప్రియులు తన అభిరుచులకు అనుకూలంగా వుండాలని కోరటమే మానవునిలోని పెద్ద బలహీనత. దగ్గరకు వచ్చిన కొలది ఒకరి బలహీనతలమీద ఒకరికి అసంతృప్తి, అయిష్టత, పెరుగుతాయి. అలాంటప్పుడు సహనంతో ఆలోచించి, ఉదార భావంతో రాజీపడాలి. అసలు వివాహమే యిద్దరి వ్యక్తులమధ్య కుదిరే రాజీ. దీన్ని మర్చిపోవటంవల్ల గృహం నరకంలాగ తయారవుతుంది.

మైత్రినీ, దాంపత్య జీవితాన్నీ, ప్రేమను దృఢంగా, శాంతంగా, సరసంగా చేసుకోవాలంటే సరసమైన అలక నేర్చుకోవటము ఎంతయినా అవసరము. ★







## వనితాలోకం:

# కాంత

జె. సత్యనారాయణ

గుబురుగా పెరిగిన చిక్కుడుపాదుకు నిచ్చెనేసి చిక్కుడుకాయలు తుంపుతోంది కాంత, వాళ్ల దొడ్లో. కాంత కొడుకు కిట్టిగాడు గడ్డిమీద పొర్లాడుతూ, వాడి కేదో పెద్ద అపకారం చేసినట్టు కసిగా గడ్డిపువ్వుల్ని ధ్వంసం చేస్తున్నాడు.

మా దొడ్లోనుంచి చూచాను కాంతను. కాంతవచ్చి నాలుగురోజు లయిందట; నిన్న మా అమ్మాయి చెప్పింది. కాంత ఎప్పుడొచ్చినా, వచ్చినరోజునే మా యింటికి పరుగెత్తుకురాందే వుండేదికాదు. కాని, యిప్పుడలా జరగలేదు. కారణం నాకు తెలుసు!

నిన్న ప్రొద్దున్న ఎనిమిది గంటలకు గదిలో వ్రాసుకుంటోంటే మా అమ్మాయి వచ్చింది గదిలోకి.

"పాపం! కాంతొచ్చిందట నాన్నా - మొన్న!" అంది. పాపం! పాపం దేనికి చూట్టానికొస్తే! ఎప్పుడూ రావటంలేదూ?

"మరి మనింటి కింతవరకూ రాలేదే?" అన్నాను మా ఉషకేసి సందేహంగా చూస్తూ.

"పాపం! సిగ్గుపడుతుందేమో!"

సిగ్గు! సిగ్గుదేనికి కాంతకి? మా యింట్లో స్వతంత్రంగా తిరిగేదే? యిప్పుడు సిగ్గుపడటానికి కారణం? ఎప్పుడు వాళ్ల మామయ్యగారింటికొచ్చినా, 'మాష్టారూ!' అంటూ ఆప్యాయంగా నవ్వుతూ వచ్చి పలకరించేదే? మరిప్పుడు సిగ్గెందుకొచ్చిందో?

"సిగ్గుదేనికమ్మా ఉషా!"

ఉష క్షణంవరకూ మాట్లాడలేదు. తల వంచుకు నిలబడి నేలచూపులు చూస్తోంది. మళ్ళీ తల ఎత్తి ముఖం గంభీరంగా మార్చింది.

"అసలు మగపురుగుల్ని నమ్మకూడదు నాన్నా!" అంది ఉద్రేకపడుతూ.

మా ఉష ఉద్రేకానికి నవ్వొచ్చింది - మగపురుగులు! - నేనుకూడా ఆ 'పురుగుల' జాబితాలో చేరుతానని తరువాత గ్రహించినట్లుంది. వెంటనే తల వంచుకొని సిగ్గుతో నాలుక కరచుకొంది.

"ఏం? కాంతని ఆవిడ భర్త ఏమయినా అన్నాడటా?"

"అంటమేకాదు. ఇంకెప్పుడూ కాంతని తన గుమ్మం త్రొక్కొద్దన్నాడట! యింకో దాన్ని తెచ్చి యింట్లో పెట్టుకుని కాంతను వెళ్లగొట్టాడట! నిన్న వాళ్ళత్తయ్య చెప్పింది నాతో" అనేసి మా ఉష విసురుగా లోపల కెళ్ళిపోయింది.

పాపం అందుకనేగామాలు మాయింటికి రాలేదు కాంత! ఆవిడ మనస్సు ఎంత క్షోభిస్తోందో? కాంతను వెళ్లగొట్టడానికి కారణం? మరో స్త్రీని వుంచుకోవటమేనా? వుంచుకుంటేమాత్రం కాంత నెందుకు వెళ్లిపొమ్మనాలి? లోకంలో యిద్దరుభార్యలున్న వ్యక్తులు ఎంతమంది లేరు? ఒక వేళ కాంత మీద ఏమయినా అనుమానం కలిగిందా. ఛీ! కాంత అటువంటిది కాదే! లేకపోతే సవతిపోరు, పడలేక కాంతే దెబ్బలాడి వచ్చేసిందా? ఏమో!

ఎలాగయినా కాంతకి జరిగిన ఈ అన్యాయానికి మనస్సు చాలా నీరసించిపోయింది నాకు. యికనుంచి కాంత భావిజీవితం ఎలా నడుస్తుంది? ఎప్పటికైనా ఆమెభర్త మళ్ళీ దరిజేర్చుకుంటాడా? మా ఉషా, కాంతా కలసి మాయింట్లో సన్నిహితంగా మెలిగేవారు. వాళ్ల మామయ్యా, అత్తయ్య కాంతను సరిగా చూడకపోతే ఆలోటు మా యింట్లో తీర్చుకునేది పాపం! బళ్ళో ఎంత తెలివిగా వుండేది కాంత! మా అమ్మాయికంటే మెరుగ్గా వుండేది.

ఈవూరు కాంత వచ్చిన అయిదవనాటి సాయంత్రంగాని మాయింటికి రాలేదు.

సాయంత్రం 5-30 ని॥ నే నింటికొచ్చే సరికి, కాంత కిట్టిగాణ్ణి చంక నేసుకుని మెట్లు దిగబోతోంది. నన్ను చూడగానే సిగ్గుతో తలవంచుకుని పలకరించకుండగనే వెళ్ళిపోబోయింది!

పాపం! తన విషయం మా ఉషవల్లగాని, వాళ్ళ అత్తయ్యవల్లగాని తెలుసుకుని వుంటానని సిగ్గుపడిపోతోం దనుకుంటాను.

కాంతను పిలిచాను. మెట్లుదిగి రెండు గజాలదూరం వెళ్ళిందల్లా ఆగిపోయింది. ముఖం యిటువైపుకు త్రిప్పలేదు.

గదిలోకి పిలిచాను. కిట్టిగాణ్ణి చంకలో యిరికించుకునే నిలబడిపోయింది, తల ఎత్త

కుండా. వాడు క్రిందకి దిగజారుతున్నాడు.

"మార్చొ కాంతా!"

కాంత ముఖంఎత్తి నావంక చూచి పేలవంగా నవ్వటానికి ప్రయత్నం చేసింది. కానీ బాధ అడ్డగించడంవల్ల నవ్వలేక పోయింది!

"పాపం అత నలాంటి వాడనుకోలేదు కాంతా మొదట!" అన్నాను జాలిగా,

కాంత మాట్లాడలేదు.

"అసలు ఏ విషయంమీద వెళ్ళిపొమ్మన్నాడు?"

"ఏమీ లేదండీ!"

కాంత ముఖం చాటుగా త్రిప్పుకుని కళ్ళొత్తుకుంది.

"పోనీ రెండు మూడు నెల్లువుండి వెళతావా?"

ఆవిడను భర్త వదలటానికి సరిఅయిన కారణం తెలుసుకోడానికి, గుచ్చి గుచ్చి

# ★ కాంతి ★

ప్రశ్నలువేసి బాధపెట్టడం యిష్టంలేదు వాడు.

రెండు క్షణాలు ఆగి, "వెళ్లను!" అంది కాంతి. కాని, అదిమున్న అభిమానం, క్రోధం కలసి వెనకనుంచి ప్రోత్సహిస్తూ బలవంతంగా ఆ మాట అనిపించినట్టు ధ్వనించింది.

"మరి కెప్పటికీ వెళ్ళవా?"

ఇది మా ఉష నవ్వుతూ వేసిన ప్రశ్న.

"ఊహూఁ! అసలు వెళ్లను!"

"ఒకవేళ అతను ఆ స్త్రీని వదిలివేసి, నిన్నే మళ్ళీ రమ్మని ఉత్తరం వ్రాస్తాడనుకో, అప్పుడు కూడా వెళ్లనంటావా?" అన్నాను కాంతి ముఖంలోకి చూస్తూ. కాంతి కనుగ్రుడ్లనిండా నీళ్లు నిండాయి. ముఖంలో బలవంతాన్న నొక్కి పట్టుకున్న బాధ పైకి రావటానికి గిజ గిజ తన్నుకుంటోంది!

"ఊహూఁ!"

ఉషా నేనూ తెల్లబోయాం. ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాం. కాంతి యిదేమీ కనిపెట్టలేదు. తల వంచుకుని నేల చూపులు చూస్తూ వుండిపోయింది. భర్త అంటే కాంతి కంత అసహ్యం దేనికో? ఆవిడ మనస్సు విరిగిపోయేటంత దారుణంగా ప్రవర్తించాడా? భరించరాని మాట లేమయినా అన్నాడా?

"మరిక్కడ ఎన్నాళ్లని వుంటావు కాంతా? మీ అత్తావాళ్లూ వుండనిస్తారా?"

"ఉండనిచ్చినన్నాళ్లే వుంటాను!"

శత్రు నాశనానికి 'ఒర'లోనుంచి కత్తి దూసినంత విసురుగా అందా మాట!

"అటు తరువాత...?"

"ఏమో!"

"పోనీ మీ తమ్ముడిదగ్గర వుంటావా కొన్నాళ్ళు?" అందా మనుకున్నాను. కాని, తరువాత ఆ ప్రశ్న అనవసరమే మనిపించింది. తమ్ముడె వెళ్ళిపొమ్మంటే మళ్లీ ఎక్కడ కెళతావ్? అని రెండో ప్రశ్న దాని వెనుకే బయలుదేరుతుంది. అప్పుడెక్కడికి వెళతానంటుంది? కాంతికి బంధువులంటూవున్నది మేనమామ, ఒక తమ్ముడు - 'వాళ్ళిద్దరూ వెళ్ళిపొమ్మంటే ఎక్కడికి వెళతావ్?' అని ముందుగానే అంచనా వేసి అటువంటి ప్రశ్న వేయటం అవివేక మనిపించింది.

క్షణంసేపు ముగ్గురం మాట్లాడలేదు. తరువాత టేబుల్ కింద పుస్తకాలు గెలుకుతున్న కిట్టిగాడ్ని తీసి చంక నేసుకుంటూ "వస్తానండి మేష్టారూ! "మళ్లీ రేపొస్తా లెండి!" అంటూ వెళ్ళిపోయింది.

"అనవసరంగా ఏమీ బాధపెట్టుకోకు కాంతా! ఏమీ భయంలేదు!" కాంతికు ధైర్యం చెప్పే ఉద్దేశ్యంతో అన్నాను. కాంతి పేలవంగా నవ్వి వెళ్ళిపోయింది. ఉష గుమ్మంవరకూ వెళ్ళి తిరిగి వచ్చింది.

"పాపం! మనస్సులో ఏదో పెట్టుకుని చెప్పటానికి బాధపడుతోంది నాన్నా!" అంది మా ఉష.

"అవును కొద్దిరోజులుంటే అదే పోతుందిలే! మళ్ళీ రెండుమూడు నెల్లో భర్తదగ్గరకు పరుగెత్తదూ?" అన్నాను నవ్వుతూ.

అలా అన్నానే గాని నిర్ణయించుకో లేకపోయాను.

*

కాంతి వచ్చేసి నెలరోజులైపోయింది. ఈ మధ్యలో కాంతి మేనమామ ఆవిడ భర్త దగ్గర కెళ్లి బ్రతిమిలాడాడట "కాంతను ఏలుకోమని". కాని, "ఆ కులటను మళ్ళీ నా యింట్లో వుంచుకునేటంత పిచ్చివాణ్ణి కాను!" అన్నాడట! కాంతను వదలటానికి కారణాలు ఏమీ చెప్పడు కూడానట! ఇకేమీ మాట్లాడకుండా తిరిగి వొచ్చేసేడు కాంతి మేనమామ. ఈ సంగతంతా కాంతి అత్తయ్య నాతో చెప్పుకొస్తూ, "అటువంటిదేదో లేకపోతే ఎంతటి వాళ్ళయినా పెళ్ళాన్ని వదిలేసుకుంటారా మేష్టారూ? అందుకే నేగాముందు మొన్న మేము పెట్టిన జాగినీగొలుసుకూడా కనిపించటంలేదు దాని మెళ్లో. అడిగితే, పెట్లో వుందంటుంది. చూపమంటే విసుక్కుంటుంది! ఈ సంగతి లోకులకు ఎవరికయినా తెలిస్తే ఎంత పరువు పోతుందో అండీ! మేము అసలు కారణం చెప్పక, ఏదో కీచులాడుకున్నారని చెప్పి కప్పిపుచ్చుతున్నాం గానీ, లేకపోతే ఈ పేటలో మేం తలెత్తుకు తిరగ్గలమా? సిగ్గు! సిగ్గు!!" అంటూ వెళ్ళిపోయింది.

ఇదంతా నిజమా? కాంతి అలాంటిదేనా? లేకపోతే కాంతిభర్త ఈవిడ అమాయకత్వాన్ని గుర్తించి, తన ప్రేయసికి ఈ భార్య అడ్డులేకుండా చేసుకునే ఉద్దేశ్యంతో యిలా అపవాదు పుట్టించి చెప్పేడా? అయితే నిజాన్ని బయటపెట్టి తను నిర్దోషిగా ఎందుకు చలామణి అవకూడదు కాంతి? అలా భర్తను అల్లరిపాలు చెయ్యటం కాంతికిష్టం లేదేమో! మరయితే ఆవిడ జాగినీగొలుసు ఏమిచేసినట్టు? నిజంగా పెట్లోనే దాచిందా? లేకపోతే భర్త త్రాగుడు కోసం దొంగతనంగా దాన్ని లాక్కున్నాడా? లేకపోతే నిజంగా కాంతి ఈమధ్య మారిపోయిందా!...

ఆరోజు సాయంత్రం రోడ్డు నూతిదగ్గర స్నానం చేస్తూంటే కాంతొచ్చింది ఒక చంకలో బిందె మరో చంకలో కిట్టిగాణ్ణి యిరికించుకుని. రోడ్డుమీద పంపుదగ్గరకు వెళ్ళటం మానేసింది.

కాంతి కిట్టిగాణ్ణి చంకదింపటం నే నెప్పుడూ చూడలేదు. ఏపని చేస్తున్నా వాడు చంకనే వుంటాడు. ప్రొద్దున్నే ఎవ్వరూ లేవకముందు, వాళ్ల వాకిలి తుడిచేటప్పుడు కూడా కిట్టిగాణ్ణి కాంతి వీపుమీద చాలాసార్లు చూశాను! ఎప్పుడైనా నేను, "అలా పూరికే చంక నెక్కించుకోకపోతే కాసేపు కూర్చోపెట్టకూడదు కాంతా? — ఆడుకుంటాడు!" అం...

"వీడు సరీగా కూర్చుంటాడా మేష్టారూ! నానా గల్లంతు చెయ్యడూ?" అనేది నవ్వుతూ, వాణ్ని హృదయానికి అదుముకుంటూ. ఒకసారి ఈ సందర్భంలోనే, "వీడుకూడా ఎదిగితే మీ ఆయనలా అల్లరివాడవుతాడేమో!" అంటే కాంతముఖం జేవురించింది.

కాంత నేరుగా ఆడిక త్రోసుకువచ్చేసిందల్లా నన్ను చూచిగాబోల్ను, బిందె క్రింద పెట్టి వెళ్ళిపోబోయింది.

"రా! కాంతా! చేదలో నా కిప్పుడేమీ పనిలేదు!" అన్నాను.

కాంత తిరిగివచ్చి కిట్టిగాణ్ని దింపి నీళ్లు తోడుకుంటోంది. భర్తదగ్గరనుంచి వచ్చేసిన తరవాత కాంతను అంత దగ్గరగా చూట్టం అదే మొదటిసారి! మనోవ్యధ కాంతి ముఖంమీద రంగులంకులతో చిత్రించబడి స్పష్టంగా కనిపిస్తోంది. జీవకళ తప్పి శిల్పంలా వుంది! రెండు కళ్ళక్రింద అర్ధచంద్రాకారపు నల్లని చార తేలింది. ముసుపు బిగువుగా 'పిట పిట' లాడుతూంటే రవిక చేతులు యిప్పుడు వదులుగా వ్రేల్లాడుతున్నై! నిజంగా నే కాంత మెడ బోసిగా వుంది.

"మెడ బోసిగావుందే కాంతా?"

అసలు యిటువంటి ప్రశ్న వెయ్యాలనుకోలేదు. కాని అప్రయత్నంగా వచ్చింది.

కాంత మెడకేసి చూచుకొని నీర్సంగా నవ్వింది. "పెట్లో దాచానండీ!" అంది.

"ఏం? పెట్టుకుంటే ఏం పోయింది?"

"ఆఁ! యిప్పుడు దేనికిలెండి!"

కాంత నీళ్లబిందె నింపుకుంది. కిట్టిగాడికోసం చూసుకుంటే వాడక్కడ లేడు. బీర పాదుదగ్గర కుదురుగా కూర్చొని పువ్వులూ పిందెలూ కోసి నలిపేస్తున్నాడు. విసురుగా వాడిదగ్గరకు వెళ్ళి గుప్పిటలోవి బలవంతంగా తీసిపారేసి విసుగుతో నాలుగు చరిచి చంక వేసుకుని వెళ్లిపోయింది, బిందె తీసుకుని!

కాంత ప్రవర్తనకి తెల్లబోయాను. వాడంటే ప్రాణం వదిలే కాంత వాణ్నిప్పుడెందుకలా కొట్టింది? యిప్పుడు నేను తెచ్చిన ప్రస్తావనవల్ల విసుగొచ్చివుంటుందా? 'మీ ఆయనలా వాడుకూడా గడుగ్గాయి అవుతా'డని నవ్వటానికంటే అదేసుండెల్లో పెట్టుకుని వాణ్ణి సక్రమమైన మార్గంలో పెట్టుకోవాలని ప్రయత్నిస్తూందా? నేను చిన్నపిల్లల మనస్తత్వాన్ని అర్థం చేసుకున్నంత సులభంగా కాంత మనస్తత్వం అర్థం చేసుకోలేనా?—

మళ్ళీ రెండురోజులవరకూ కాంత మా యింటికి రాలేదు! ఒకవేళ వచ్చిందేమో నేనున్నప్పుడుమాత్రం రాలేదు.

మూడవనాడు నేనుండగానే వచ్చింది. మొన్ననే మా ఉష భర్త వచ్చాడని, ఈవేళ ప్రొద్దున్న తీసుకెళ్ళిపోతాడని తెలిసి స్నేహితురాల్ని సాగనంపటానికి వచ్చిందనుకుంటాను.

"పాపం! మేష్టారికి ఈరాత్రినుంచి మళ్లీ కేరియరు మీల్సు గాబోలు!" అంది నవ్వుతూ.

నేను నవ్వి వూరుకున్నాను. కాంత రోజుకన్నా ఎక్కువ ఉత్సాహంగా వుంది!

మా ఉషను ఉత్సాహంగా సాగనంపింది కాంత. ఉష కన్నీళ్లు పెట్టుకుంది, బండి ఎక్కేటప్పుడు, "నీకూ యిలాంటి రోజు త్వరలోనే వస్తుంది కాంతా!" అని మా అమ్మాయి దీవించినప్పుడు కాంత ముఖం వివర్ణమవటం నేను చూచాను! ఒకవేళ ఉషకూడా...ఛ ఛ! ఏమిటీ పాడు ఆలోచనలు అనిపించింది.

* * *

మా ఉషలేని లోటు కాంత తీరుస్తోందిప్పుడు! రెణ్నెల్లుండి ఉష భర్తదగ్గరకు వెళ్ళిపోగానే మాయిల్లు వెలవెలబోయింది. కాని, కాంత తరుచు మా యింటికొస్తూ కులాసాగా మాట్లాడేది. భర్త విషయాన్ని నాదగ్గ రెప్పుడూ ఎత్తేదికాదు. నేనుకూడా ఆ విషయంమీద ప్రశ్నలు వెయ్యటం మానివేశాను. అలా వేస్తే కాంత బాధపడుతుందని తెలుసు.

కాంత రోజురోజుకూ క్షీణించిపోతూన్నా ఉత్సాహంగా మాట్లాడేది! కాని, పరీక్షగా చూస్తే అలా వుంటానికి బలవంతంగా ప్రయత్నిస్తోందని అనుమానం కలక్కపోదు. అప్పుడప్పుడూ కిట్టిగాణ్ని నాకిచ్చేది ఎత్తుకోమని నా చంకలో కిట్టిగాణ్ణి చూచినప్పుడల్లా తృప్తిపడుతూన్నట్టు కనిపించేది కాంత. "మీలాగే వీడికి కూడా పెద్ద చదువు చెప్పించి పెంచుకోగూడదు మేష్టారూ!" అనేది అప్పుడప్పుడు. "అబ్బో! నన్ను బ్రతకనిస్తాడా ఈ గడుగ్గాయి! అయినా మీఆయ నొప్పుకుంటాడా నేను పెంచుకుందుకు?" అంటే ఉలిక్కిపడి నావంక జాలిగా చూచేది.

సాయంత్రం మాదొడ్లో నీళ్లకొచ్చినప్పుడు కాంత పాదులకి, పువ్వుల మొక్కలకీ నీళ్లుపోసేది. యింట్లో పనిచేసేపిల్లవున్నా నాగది, టేబుల్ కుర్చీలూ శుభ్రంగా తుడిచేది. చక్కగా సర్దేది. ప్రతి శుక్రవారం నే నింటికొచ్చేసరికి గచ్చంతా శుభ్రంగా కడిగి, ముత్యాలవంటి ముగ్గులతో అలంకరించేది! ఎందు కింత కష్టపడుతుంది కాంత? పెళ్ళాం, పిల్లలు లేక వంటరిగావున్న ఈ వయస్సుమళ్లిన బడిపంతులింటికి ఎందుకీ అలంకరణ? కాని, కాంత ఉత్సాహాన్ని కాదనలేకపోయాను. ఈవిధంగానైనా కాంత సంతోషంగావుంటే ఆమె మనస్సు కొంచెం శాంతిస్తుందనుకున్నాను. కాని, అప్పుడప్పుడూ కాంత కళ్లు ఎఱ్ఱగా జ్యోతుల్లా మెరిసిపోతుండేవి! చాటుగా ఎవ్వరికీ తెలియకుండా కుమిలికుమిలి ఏడ్చినట్లు అప్పుడప్పుడు ఆమెముఖమే చెప్పేది. కాని మాయింటిదగ్గిరున్నంతసేపు ఉత్సాహంగా మాట్లాడటానికి ప్రయత్నించేది! కాంత లోలోన కుళ్లిపోతూ భరించరాని బాధ అనుభవిస్తోందని నాకు తెలుసు. తెలిసి నేను చెయ్యగలిగిందేముంది?

ఎప్పుడూ చలించని కాంత ఆనాడు నా గదిలోకొచ్చి చంటిపిల్లలా ఒక్కసారి బావురుమంది.

ఆరోజు, ఆరుగంటలకు హోటల్ నుంచి కేరియర్ తీసుకొచ్చాడు కుఱ్ఱవాడు. భోజనం ముగించుకొని నా గదిలో పడకకుర్చీలో మేను వాల్చేను.

ఆ సమయంలోనే కాంత కిట్టిగాణ్ణి చంక వేసుకొనివచ్చి వక్కసారిగా బావురుమంది!

కిట్టిగాణ్ణి హృదయానికి అదుముకుంటూ కొంగుతో ముఖం కప్పుకుని ఏడుస్తోంది కాంత. రెండుమూడుసార్లు కారణం అడిగినా జవాబు చెప్పలేదు. మూడోసారి మాత్రం దుఃఖం దిగమ్రింగటానికి ప్రయత్నించింది.

"వీడికోసమైనా బ్రతుకుదామనుకున్నాను!" అని మళ్లీ భోరుమంది.

"మీ అత్తగాని, మామగాని ఏమయినా అన్నారా కాంతా? లేకపోతే యింట్లోనుంచి వెళ్ళిపొమ్మన్నారా? ఎందుకంతగా ఏడుస్తావు? వాళ్ళలాగంటే మీ తమ్ముడిదగ్గర కెళ్లొచ్చుగా! నీకు అక్కడా వుండటం యిష్టంలేకపోతే, పోనీ మా యింట్లో వుండు! నీకేం అభ్యంతరం? మా ఉష ఎంతో నాకు నువ్వూ అంతే!"

నే నన్న ఈ చివరిమాటను విన్న తరువాత కాంత కొంచెం శాంతించింది! ముఖం ఎత్తి నావంక అమాయికంగా చూసింది. ఏడుపు సంబాళించుకున్న తరువాత నేను కాంతను చాలా ప్రశ్నలు వేసి, విసిగివేసారాను! అన్నీ ముక్తసరి జవాబులే - కొన్ని

## ★ కాంత ★

టికి ఉత్తరమూ గజవాబులు కూడా యిచ్చింది. యిక కాంతను మరీ బాధపెట్టడానికి ఇష్టం లేక వూరుకున్నాను అప్పటికి. మొత్తం మీద కాంత ముక్తసరి జాబులన్నిటిలోనూ వాళ్లమామ దగ్గర గానీ, తమ్ముడి దగ్గర గాని వుండననే ఘోషిస్తూంది.

ఆరాత్రి కాంతను భోజనం చెయ్యమంటే చెయ్యనంది. అయినా మరో కేరియర్ తెప్పించి బలవంతంచేసి దగ్గర కూర్చొని ఊఅడింపుగా కబుర్లు చెబుతుంటే రెండు మెతుకులు కొరికి తక్కింది పక్కకు వేసింది. నా గదిలో మంచంమీద పడుకొమ్మంటే వినక కింద చాప వేసుకుని పడుకుంది.

నేను మంచం, గడియారం, పుస్తకాలు మొదలయినవాటిని గదిలోనించి ఇవతలికి తీసుకొచ్చేసరికల్లా గేటు దగ్గర కాంత మామయ్య కేక వినిపించింది. నేనే బయటకు వెళ్లేను, అతన్ని లోపలకు పిలిస్తే మళ్ళీ ఏదైనా గొడవ పెడతాడనే ఉద్దేశ్యంతో.

బయట కలిసే కాంతనుగురించి ఏదో చెప్పుకొచ్చాడు అతను. ఈ గొడవ జరిగే టప్పుడు అతనింటిదగ్గర లేడట. అన్నిటికీ 'ఊఁ' కొట్టేను. "కడుపుమండి ఒకవేళ అది ఏదో అందనుకోండి. అంతలోనే దానికంత రోషంవచ్చి ఛోరున ఏడుస్తూ ఊరంతా చాటాలా? అంత రోషం వున్నది గాబట్టే దాని గతి అలా తగులడ్డది!" అంటూ హేయభావంతో చెప్పుకొచ్చాడు. అతన్ని కాంతపర్చి, "రేపు ప్రొద్దున్న వస్తుందిలెండి - యివ్వాలికి యిక్కడ పడుకోనివ్వండి!" అని సమాధానపరచి పంపించాను. అతను మరేమీ మాట్లాడకుండా నే వెళ్ళిపోయాడు

నేను లోపలికొచ్చి కాంతను చూచాను వాళ్ళ మామయ్యొచ్చిన జాడ ఏమయినా పసిగట్టిందేమోనని. కాని, అటువంటిదేమీ లేదు. కిట్టిగాణ్ణి గుండెలమీద బోర్ల పడుకోబెట్టుకుని రెండు చేతులతో అదుముకుంటూ పడుకుంది!

తెల్లవారుఝాము అయినట్లుంది. కోడి కూతలు వినిపిస్తున్నై.

బద్ధకంగా లేచాను. కాని వెంటనే త్రుళ్లి పడ్డాను! నా ప్రక్కలో కిట్టిగాడు!! యిక్కడికెలా వచ్చాడు? కాంత ఏమయినట్లు?

వెంటనే గదిలో కెళ్లేను. గదిలో లేదు! ఒకవేళ పనిపిల్ల యింకా రాలేదని వాకిలి ఊడుస్తుందా? అరె! అక్కడా లేదే? మరి ఎక్కడికి వెళ్ళింది కాంత? మళ్ళీ నా మంచం దగ్గరకు పరుగెత్తేను. కిట్టిగాడు ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. అరె! వాడి ప్రక్కన ఏదో కాగితం!

వనికే గోడలాంపు పెద్దదిచేసి కాగితం విప్పేను:

పూజనీయులైన మాష్టారూ!

నా కిట్టిగాణ్ణి మీకు అప్పగిస్తున్నాను. మీరే వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసి, చదువు చెప్పించి మంచిమార్గంలో పెట్టండి. మీరు ఈ నా చిన్న కోర్కెను తీర్చగలరనే ఆశిస్తూ న్నాను!

మీ శిష్యురాలు,
కాంత.

ఏమిటీ అర్థంలేని ఉత్తరం! ఎంత పని చేసింది కాంత! జీవితంమీద విరక్తిపుట్టి ఆత్మహత్య చేసుకుందా? మరి ఆ సంగతేమీ వ్రాయలేదే! రేపు ప్రొద్దున్న వాళ్ల మామయ్యవాళ్లు మా కాంతేది అంటే ఏం చెప్పను? కిట్టిగాణ్ణి పెంచుకుంటానికి నాకేం అధికారముంది? ఆమె భర్తవచ్చి తన కొడుకును తనకిమ్మని దెబ్బలాడితే నేనేం చెయ్యగలను? 'యివ్వ' నంటానికి నేనెవర్ని? అయినా కిట్టిగాడంటే ప్రాణంవదిలే కాంత యిలా నాదగ్గర వదిలిపోయిందే! కాంత ఈ చిన్న కోర్కెను నేనెలా తీర్చగలను? అర్థంగాని సమస్యలో వదిలిపోయింది. అసలు యింతకీ కాంత ఏమయినట్లు? ★



# సముద్రతీరాన

కవిరావు

ఆడుకొంటున్నారు
అందాల పాతల్లు
అవధిదొరుకని గభీ
రాంబుధులతీరాన
ఆడుకొంటున్నారు...

కవ్వించిసంద్రమ్ము
గర్జించుకొనుచుండ
నిర్మలంబగునింగి
నీలినీడలక్రింద
ఆడుకొంటున్నారు...

దుమ్ములోపలతీర్చి
బొమ్మరిల్లనుకట్టి,
చీకుచింతలు లేక
లోకంబునే మఱచి
ఆడుకొంటున్నారు...

పుడకలాకులు తెచ్చి
పడవైచి యొక్కొక్కటి
కడలిపై తేల 'నా
పడవ,' 'నాపడ'వంచు
ఆడుకొంటున్నారు...

కొంటె కెరటాలొచ్చి
కొట్టిపోవుచునుండ
తడిసి మోములు, ఉబ్బు
తబ్బిబ్బులై బాల
లాడుకొంటున్నారు...

గులకరాలే తమకు
గుప్తధనముగ నెంచి
వెదకుకొనుచును వారల
వెదజల్లుకొనుచు వా
రాడుకొంటున్నారు...

ముద్దుపాపలజూచి
మురిసిపోయిన జలధి
లక్షగొంతులతోడ
లాలిపాటలు పాడ
ఆడుకొంటున్నారు...

కడలి గర్భములోని
బడబానలము రగిలి
'బగ్గు'మని లోకాల
బుగ్గిచేయుట తెలియ
కాడుకొంటున్నారు...

[ఆధారము: టాగోర్]



బొమ్మరిల్లు సీరియల్



# టామ్‌సాయర్ ప్రపంచ యాత్ర

మూలం మార్క్‌ట్వేన్

ఈ సీరియల్ టామ్‌సాయర్, హకల్ బరిఫిన్ నవలలకు తరువాత జరిగిన కథను తెలుపుతుంది. "హకల్ బెరిఫిన్" నవలలో మాదిరిగానే ఈ నవలలో కూడా హకల్ బెరిఫిన్ అనే కుర్రవాడే కథ చెబుతాడు. ఈ నవలలో టామ్‌సాయర్ అనే మరోకుర్రవాడూ, హకల్ బెరిఫిన్, వీళ్ళ స్నేహితుడైన జిమ్‌అనే నీగ్రోముఖ్యపాత్రలు. టామ్‌సాయర్‌కు ఎప్పుడూ ఏదో సాహసం చేస్తూనే వుండాలనీ, తనపేరు దేశదేశాల్లో మోగిపోతూ వుండాలనీ కోరిక. అంచేత ఇదివరకు చేసిన సాహసాలతో తృప్తిపడక, కొత్తవాటికోసం చాలా ప్లాన్లు వేస్తాడు. కాని మిగతా వాళ్ళిద్దరూ అతని ప్లాన్లు అన్నిటినీ తోసివేస్తారు. ఏంచేయడానికీ పాలుపోకుండా వున్న సమయంలో, ఒక ప్రొఫెసరు బెలూన్‌లో యూరప్ ఖండానికి బయలుదేరనున్నట్లు వాళ్ళకి తెలుస్తుంది. అది చూసివద్దామని వెళ్ళిన టామ్, హక్, జిమ్ ముగ్గుర్నీ ప్రొఫెసరు లోపలికి రానిచ్చి హఠాత్తుగా బెలూన్‌ను బయలుదేర దీస్తాడు. యూరప్ ప్రయాణమై పోతున్న విమానంలో ముగ్గురు మిత్రులు నిర్ఘాంతపోయి కూర్చున్నారు.

## 3

వేము నిద్రలేచేసరికి, ప్రొఫెసరు విమానంలో అవతలి చివర దిగాలుపడి కూర్చునివున్నాడు. మేము లేవగానే ఇంత తిండిపడేశాడు. కాని మమ్మల్ని విమానపు మధ్యప్రదేశాన్ని దాటిరావద్దని ఆజ్ఞాపించాడు.

మంచి ఆకలిమీదున్న మనిషికి కడుపునిండా తిండిపడగానే, ప్రపంచమంతా ఇదివరకటికంటె అందంగా, సుఖంగా వున్నట్టు కనిపిస్తుంది. కడుపు నిండినతర్వాత, ఆకాశంలో వేళ్లాడుతున్నప్పటికీ హాయిగానే వున్నట్టుంటుంది. మేము ముగ్గురము నెమ్మదిగా కబుర్లలో పడ్డాము.

నన్ను చాలసేపటినుంచి బాధపెడుతున్న సమస్య ఒకటుంది.

"టామ్! మనం తూర్పుదిక్కుగా బయల్దేరాము గదూ?"

"అవును."

"మన విమానం ఎంతవేగంగా పోతోందంటావు?"

"ప్రొఫెసరు కోపంలో అన్నమాటలు నువ్వు విన్నావుగా? ఒకసారి గంటకు యాభైమైళ్ళవేగంతో పోతున్నామన్నాడు. ఒకసారి తొంభైఅన్నాడు. ఇంకోసారి వంద అన్నాడు. వాయువేగం తోడైతే గంటకు మూడువందలమైళ్లు పోగలననికూడా అన్నాడు. వాయువు సహాయం కావలిస్తే, బాగాపైకిగాని, బాగా కిందికిగాని పోతే వాయుప్రవాహం విమానానికి తోడు పడుతుందని కూడా చెప్పాడు."

"అలాగా. సరే. నేననుకున్నంతా అయింది. ప్రొఫెసరు పచ్చి అబద్ధాలకోరు," అన్నానునేను.

"ఏం?" అన్నాడు టామ్.

"మనం అంతవేగంగా పోతున్నట్లయితే ఈ పాటికి ఇలినాయిస్ రాష్ట్రందాటి వుండాల్సిందిగదూ?"

"అవును."

"కాని ఇంకా మనం ఇలినాయిస్ దాటనేలేదు."

"దాటలేదని ఎందు కనుకుంటున్నావు?"

"రంగునిబట్టి నేను గ్రహించాను. మనం ఇంకా ఇలినాయిస్ మీదనే వున్నాం. ఇండియానా రాష్ట్రం ఇంకా రాలేదని కనిపించడంలేదూ?"

"హాక్! నీవుద్దేశ్యమేమిటో నాకు తెలియడం లేదు. రంగునిబట్టి ఎలా తెలుసుకోగలవు?"

"ఆ. రంగునుబట్టే తెలుసుకోగలను"

"రంగుకీ దీనికీ సంబంధమేమిటి?"

"కావలసినంతవుంది. ఇలినాయిస్ ఆకుపచ్చగా వుంటుంది. ఇండియానా ఎర్రవాగుగా వుంటుంది కిందికి చూడు, ఇక్కడెక్కడైనా ఎరుపు కనిపిస్తోందేమో? అంతా ఆకుపచ్చగానే కనిపిస్తోంది."

"ఇండియానా ఎర్రవాగుగా వుంటుందా? ఎవరు చెప్పారు నీకు?"

"ఎవరు చెప్పడమేమిటి? దేశపటంలో నేను చూస్తేనే? ఎర్రగా కనిపిస్తేనే?"

ఈమాటనేసరికి టామ్ బాగా చిరాకుపడ్డాడు.

"హాక్! నేనే గనక నీఅంత తెలివితక్కువ శుంఠనైతే ఈపాటికి కిందికి దూకి ఆత్మహత్య చేసుకుని వుందును. దేశపటంల్లో చూశావా? హాక్ఫిన్! దేశపటంలో ఏరాష్ట్రం ఏరంగులో వుంటే ఆరాష్ట్రం ఆ రంగులోనే ఆరుబయటకూడా వుంటుందని నీ వుద్దేశమా?" అన్నాడు. కాని నేను ధైర్యంగా ఎదురు ప్రశ్న వేశాను:

"టామ్! దేశపటం దేనికి తయారుచేస్తారు? ఉన్నది ఉన్నట్టుగా చూపించడానికేనా?"

"అవును. అయితే?"

"అయితే, దేశపటం అబద్ధాలు చెప్పదన్న మాటేనా?"

"అవును, చెప్పదు."

"చెప్పదుగదూ?"

"చెప్పదు."

"దేశపటంలో ఏరెండు రాష్ట్రాలూ ఒకే రంగులో ఉండవు. అందుకనే ఇండియానారాష్ట్రం ఎర్రగా వుంటుందని అన్నాను. ఇది అబద్ధమంటావా టామ్సాయర్?"

పాపం టామ్ నన్ను బోల్తాకొట్టించబోయి తనే బోల్తాపడ్డాడు. ఈసంగతి జిమ్కూడా గ్రహించాడు. టామ్సాయర్ను బోల్తా కొట్టించడం సాధారణంగా తేలికపనికాదు. కాని ఈసారి మాత్రం నేనే ఖచ్చితంగా బోల్తాకొట్టించాను. జిమ్ చప్పట్లుకొట్టి,

"బలే, బలే! మా బాగా బోల్తాకొట్టించావు. టామ్గారూ! ఇక మీరు లాభంలేదు. మిమ్మల్ని హాక్ సాపుగా బోల్తాకొట్టించాడు. బలేబలే"అన్నాడు.

అప్పుడు నేననుభవించినంత ఆనందం మరెప్పుడూ అనుభవించలేదనుకోండి. కాని నేనింత గొప్పవాణ్ణని నాకే తెలియలేదుసుమండీ. ఇంతగొప్ప ఆలోచన, తర్కజ్ఞానం నాకు కలిగిందంటే నాకే నమ్మబుద్ధి కాలేదు. నేనేదో మామూలుగా, నాధోరణిలో నేను మాట్లాడుతూ పోతున్నాను. ఇంతలో హఠాత్తుగా ఈ ఆలోచన తట్టింది. మిగతా వాళ్లకి అదెంత ఆశ్చర్యం కలిగించిందో నాకూ అంతే ఆశ్చర్యం కలిగించింది. ఒక్కొక్కసారి ఇలాంటి తమాషాలే జరుగుతూ వుంటాయి. ఉదాహరణకి, రొట్టె కొనుక్కుని తింటున్నామనుకోండి. ఏదో ఆలోచిస్తూ నములుతూ వుంటాము. ఇంతలో హఠాత్తుగా ఒక వజ్రం పళ్లకింద పడుతుంది. ఏదో మట్టిబెడ్డ పళ్ళమధ్య పడిందనుకుంటాము ముందు. నోట్లోంచితీసి శుభ్రంగా తుడిచి చూస్తాము. అప్పు

# ★ టామ్ సాయర్ ప్రపంచయాత్ర ★

తడి వజ్రమని తెలుస్తుంది. మనకప్పుడు ఎంత ఆశ్చర్యం ఎంత సంతోషం, ఎంతగర్వం కలుగుతాయంటారు? నిజమే, ఇందులో గర్వించవలసిందేమీ లేదనుకోండి. నిదానంగా ఆలోచించి చూస్తే, ఆరొట్టెలో ఆ వజ్రం కనిపించిందంటే, అందులో మన గొప్పదనం ఏముంది? మనం కావాలని వజ్రాలకోసం వెదుకుతూ, మనంతట మనం శ్రమపడి, చెమటోడ్చి కనుక్కోగలిగితేతప్ప, దానంతటదే దయతలిచి మనకి దర్శనమిచ్చినప్పుడు ఇక మన ఘనతఏముంది? యాదృచ్ఛికంగా ఒకపని జరగడంవేరు, కావాలని మనం ఆపనే సాధించడం వేరు. కాని రొట్టె కొరుకుతున్నప్పుడు వజ్రం మనపళ్ళకే తగలడమేం? ఇంకొకళ్ల పళ్ళకెందుకు తగలగూడదు? ఊహు. మనపళ్ళకే తగిలింది. అందుకని మనలో ఏదో ప్రతిభ ఉందన్నమాటే. అలాగే నాకు అంత అద్భుతమైన ఆలోచన తట్టిందీ అంటే నాలో ఏదో ప్రత్యేకత ఉందన్నమాటేగా? నేనేదో మరీ గొప్పవాణ్ణి అంటున్నాననుకోకండి. నాకు ఇంకోసారి అంత మంచి ఆలోచన రాకపోవచ్చును. కాని ఆసమయంలో వచ్చింది. అంతే. అది వస్తుందని నేననుకోలేదు. అసలు దాన్నిగూర్చి నేను ఆలోచించడంలేదు. అతిమామూలుగా, అతి సాధారణంగా నాధోరణిలో నేను మాట్లాడుకుపోతున్నాను. హఠాత్తుగా ఆ ఆలోచనవచ్చింది. నాకు అప్పటి పరిస్థితులు ఇప్పటికీ బాగా జ్ఞాపకం ఉన్నాయికూడను. మా విమానం జోరుగా పోతోంది. కింద అడవులు, మైదానాలు, సరస్సులు దొర్లిపోతున్నాయి. వందలకొలది మైళ్ళదూరం దృష్టి గోచరమౌతోంది. ఎక్కడపడితే అక్కడ పట్టణాలు, పల్లెలు చెల్లాచెదురై వున్నాయి. ప్రొఫెసరు తన బల్లవద్ద కూర్చుని ఏదోపటం పరిశీలిస్తున్నాడు. ఎండలో ఆరబెట్టిన టామ్‌టోపీ అటూ యిటూ వూగుతోంది. ముఖ్యంగా, ఒకపక్షి మా విమానానికి పది అడుగులదూరంలో ఎగురుతూ రావడం నాకు బాగా జ్ఞాపకంఉంది. విమానంతో పాటు ఎగరాలని దాని తాపత్రయం. కాని ప్రతిసారీ అదే వెనకబడిపోతోంది. నేలమీద ఒకరైలుబండి కూడా అలాగే మాతోపోటీచేసి వెనకబడింది. మరి కొద్దిక్షణాల్లో పక్షీలేదూ, రైలూలేదు; రెండూ కొన్నిమైళ్లు వెనకబడిపోయాయి. మావిమానం అవలీలగా వాటిని దాటేసింది.

టామ్‌మాత్రం నన్నూ, జిమ్‌నూ మట్టిబుర్రలన్నాడు. "ఇదిగో హక్! నేను చెప్పేదివిను. ఒక గోధుమరంగు ఆవుదూడ, గోధుమరంగు కుక్క ఉన్నాయనుకో. ఒక చిత్రకారుడు వాటిని ఒకే కాగితంమీద చిత్రిస్తున్నాడనుకో. ఆ చిత్రకారుడు అటువంటప్పుడు ఏం చేస్తాడు? చూడగానే అదివేరూ, ఇదివేరూ అని చెప్పడానికి వీలైనవిధంగా చిత్రించాలి, అవునా? కుక్కనీ, దూడనీ రెంటినీ గోధుమరంగుతోనే చిత్రిస్తే ఏమవుతుంది? ఇది కుక్క, ఇది దూడ అని చెప్పడానికి వీల్లేకపోతుంది. అందుకని ఒకదాన్ని నీలంగా వేస్తాడు. అప్పుడు ఏదిఏదో చెప్పుకోడం తేలిక. అవునా? అదేమాదిరిగా దేశపటాలుకూడాను. అందుకే దేశపటంలో ఒక్కొక్క రాష్ట్రాన్ని ఒక్కొక్కరంగులో వేస్తారు. అది నిన్ను మోసపుచ్చడానికి కాదు, నువ్వు మోసపోకుండా చెయ్యటానికే."

టామ్ ఇంతగా వివరించి చెప్పినా, నాకు అదంతా అసందర్భంగానే కనిపించింది. జిమ్‌కూడా నాతో ఏకీభవించాడు. జిమ్ ఇలా అన్నాడు:







"టామ్‌గారూ! మీకు బొమ్మలు వేసేవాళ్ల సంగతి బొత్తిగా తెలియనట్టుంది. నాకు బాగా తెలుసును వాళ్లెంత పిచ్చివాళ్లో. ఒకసారి నేను ఒకణ్ణి చూశాను. వాడు ఒక ముసలి ఆవును ఎదురుగుండా పెట్టుకుని బొమ్మగీస్తున్నాడు. ఆవు బొమ్మ ఎందుకు గీస్తున్నావని అడిగాను. అంటే వాడంటాడూ, ఆబొమ్మ పూర్తయిన తర్వాత దాని ఖరీదు వంద డాలర్లుంటుందట. నాకు చచ్చేనవ్వొచ్చిందనుకోండి టామ్‌గారూ! ఇంతా చేసి ఆ ముసలి ఆవు ఎంత చేస్తుంది? మహా చేస్తే పదిహేను డాలర్లు. ముష్టి పదిహేను డాలర్లు. ఆమాటే వాడితో చెప్పాను. వాడు వినిపించుకుంటేగా. నీకేం తెలియదులే అన్నట్టు తల అడ్డంగా ఊపి, తన పని తాను చేసుకుపోతున్నాడు. అదీ ఈబొమ్మలు గీసే వాళ్ళ తెలివి. ఏమంటారు టామ్‌గారూ?"

టామ్ చిరాకు వర్ణనాతీతం. నాకు తెలుసు, జవాబు చెప్పలేక వోడిపోయినవాడెప్పుడూ అలాగే చిరాకు పడతాడు. మమ్మల్ని నోరుమూసుకోమన్నాడు. మాబుర్రల్లో వున్న బురదను ఆట్టే కెలక వద్దనీ, కాసేపు ఎండబెడితే బురద గట్టిపడి కొంచెం బాగుపడతామనీ తిట్టాడు.

ఇంతలో దూరంగా ఒకపట్టణంలో గోపురపు గడియారం కనబడింది. దూరదర్శిని యంత్రం తీసుకుని టామ్ దానివంక చూశాడు. తరవాత తన గడియారం చూశాడు. మళ్ళీ దూరపుగడియారం చూశాడు. "అరె, చిత్రంగా వున్నదే, ఆ గడియారం ఒక గంట ముందు నడుస్తోంది," అన్నాడు. కొంతసేపైన తరవాత ఇంకోగడియారం కనబడింది. అదీ గంటముందుకే నడుస్తోంది. ఆశ్చర్యపడ్డాడు. "అర్థం కావడంలేదు. ఏమిటబ్బా యీవిచిత్రం!" అన్నాడు.

మళ్ళీ దూరదర్శిని తీసి ఇంకో గడియారంకోసం వెదికాడు. ఇంకోటి కనిపించింది. దానిబొడ్డు పొక్కా, అదీ గంటముందుకే వుంది. టామ్‌కళ్లు ఆశ్చర్యంతో పెద్దవైనాయి.

"అరె. ఆ, తెలిసింది, తెలిసింది. అదే మధ్యాహ్న రేఖ!" అని అరిచాడు.

నాకు చాలా భయంవేసింది, ఏదో కొంపమునిగిందని.

"ఏమిటది టామ్? ఏం జరిగింది?"

"ఏం జరిగిందేమిటి హాక్? ఈ విమానం ఇలినాయిస్, ఇండియానా, ఓహియో రాష్ట్రాలను దాటేసింది. మనమిప్పుడు పెన్సిల్‌వేనియా తూర్పు చివరనో, న్యూయార్కు దగ్గర్లోనో వున్నాం."

"నిజమేనా టామ్‌సాయర్?"

"నిజమేమిటి? నిజమున్నర. నిన్న మధ్యాహ్నం మనం సెంట్‌లూయీ వదిలిపెట్టిన తర్వాత సుమారు పదిహేను మధ్యాహ్న రేఖలు ఇప్పటికి దాటాము. ఆ కనిపించే గడియారాలు సరియైన టైమే చూపిస్తున్నాయి. మనం ఎనిమిదివందలమైళ్ళదూరం వచ్చాం ఇప్పటికి."

నేను ఈమాట నమ్మదలుచుకోలేదు, నమ్మలేదు. అయినా అది వినేసరికి భయంలాంటి పదార్థమేదో మెడదగ్గిర్నించి వెన్నముక మీదుగా కిందికి జారింది. నా స్వానుభవం ప్రకారమైతే ఎనిమిదివందల మైళ్లు మిసిసిపీ నదిలో పడవలో ప్రయాణం చెయ్యడానికి రెండువారాలకు తక్కువ పట్టదు. కనుక టామ్ మాట నేను ఎంత నమ్మాలనుకున్నా నమ్మలేకపోయాను.

జిమ్‌కూడా ఈ విషయమే చాలాసేపటినుంచీ ఆలోచిస్తున్నాడు. టామ్‌ను వాదంలో ఎలా వోడించడమా అని చూస్తున్నాడల్లేవుంది. చివరికిలా అడిగాడు:







## ★ టామసాయర్ ప్రపంచయాత్ర ★

"టామ్‌గారూ! ఆ గడియారాలన్నీ రైటేనని విూరన్నారు గదూ?"

"అవును."

"విూ గడియారం కూడా రైటే గదూ?"

---

"సాగడియారం మన గ్రామానికి సంబంధించి నంతవరకూ రైటే. కాని ఇక్కడ ఒకగంట వెనకబడి వుంది" అన్నాడు టామ్.

"అంటే మీ వుద్దేశ్యం, సైము నేది అన్నిచోట్లా ఒకేమాదిరిగా వుండదనా?"

"అవును. సైము అన్నిచోట్లా ఒకేమాదిరిగా వుండదు."

జిమ్ చాలా విచారపడ్డాడు: "టామ్‌గారూ! మీరు ఇంతలో ఇలా మారిపోతారని అనుకోలేదండి. ఇంత పాడైపోతారని కలలోనైనా ఊహించలేదండి. మీవంశం ఎంత గొప్పది! మీవాళ్లంతా ఎంత మంచివాళ్లు! మిమ్మల్ని ఎంతజాగ్రత్తగా పెంచారు! ఇప్పుడు మీరన్నమాటలు మీ పోలీపెద్దమ్మగారే గనక వింటే ఎంత దుఃఖిస్తుందోగదా!"

టామ్ ఏదో చెప్పరాని ఆశ్చర్యం ప్రకటించాడు. జిమ్‌కేసి అలాగే నోరు తెరుచుకుని చూశాడు. ఏమీ మాట్లాడలేక పోయాడు. జిమ్ ఇంకా ఇలా గన్నాడు:

"టామ్‌గారూ! నామాట జాగ్రత్తగా వినండి. మనవూళ్లో మనుష్యుల్ని ఎవరు తయారుచేశారు? దేముడేగదూ? సరే. ఇక్కడిమనుష్యుల్ని ఎవరు చేశారు? దేముడేగదూ? అంటే ఏమిటన్నమాట? అక్కడి మనుష్యులూ, ఇక్కడిమనుష్యులూ కూడా ఒకే దేవుడియొక్క కన్నబిడ్డలు. ఈవిషయం అనుమానం లేదుగా. అయితే తన కన్నబిడ్డల విషయంలో దేవుడు తేడాలు చేస్తాడా?" దీనికి మీరు సమాధానం చెప్పండి."

"తేడాలా? ఓరి పిచ్చివాడా? నిన్నూ, నీలాంటి వాళ్లు మరి కొందరిని నల్లవాళ్లుగాచేసి మిగతవాళ్ళందర్నీ తెల్లవాళ్లుగా చేసిన దేముడికి పక్షపాత బుద్ధి ఉందంటావా లేదంటావా?"

ఇందులో వున్న సత్యం జిమ్ గ్రహించాడు. దానికి సమాధానం చెప్పలేకపోయాడు. టామ్ ఇంకా ఇలా అన్నాడు.

"చూశావా జిమ్! దేవుడు నిజంగా తెలుపు నలుపు పక్షపాతం చూపిస్తాడు. కాని సైము విషయంలో ఆయనపక్షపాతం ఏమీ లేదు. ఇందులో దేవుడి ప్రమేయం లేదు. అంతా మానవుడిదే. దేవుడు చేసిన పనల్లా పగలూ, రాత్రి అనేభేదం ఏర్పరిచాడు. కాని గంటలు ఏర్పాటుచేసింది దేవుడు కాదు. పగటి పూట కిన్ని గంటలు, రాత్రిపూట కిన్ని గంటలూ అని అని దేవుడు ఏర్పాటుచేయలేదు. ఆ పని మానవుడే చేశాడు."

"టామ్‌గారూ! అది మానవుడే చేశాడంటారా?" అన్నాడు జిమ్.

"తప్పకుండాను."

"అలా చెయ్యవచ్చునని మానవుడికి ఎవరు చెప్పారు"

"ఎవరూ చెప్పలేదు. అతనెవర్నీ అడగలేదు."

జిమ్ కొంతసేపు ఆలోచించి ఇలా అన్నాడు:

"నేనైతే అంత సాహసం చేసేవాణ్ణి కాదు. కాని కొందరు కొందరు పర్యవసానం ఆలోచించకుండా ఏదితోస్తే అది చేసేస్తారు. దానివల్ల వచ్చే నష్టాలూ, గిష్టాలూ ఏమీ ఆలోచించరు. అయితే టామ్‌గారూ! ప్రతిచోటా ఒక్కొక్క గంట తేడా వుంటుందంటారా?"

"ఉహూ, గంట కాదు. ఒక్కొక్క మధ్యాహ్న రేఖాకి నాలుగేసి నిమిషాల తేడా వస్తుంది. పదిహేను మధ్యాహ్న రేఖలైతే ఒకగంట తేడా వుంటుంది. ముప్ఫయ్ అయితే రెండుగంటల తేడా వస్తుంది. ఇంగ్లండులో మంగళవారం తెల్లవారుఝామున ఒంటిగంట అయితే, న్యూయార్క్‌లో ఆ క్రితంరాత్రి ఎనిమిది గంటలవుతుంది."

జిమ్ ముఖం అటు తిప్పుకున్నాడు. తన కేదో అవమానం జరిగినట్లు భావించుకున్నాడు. తల ఊపుతూ ఏదో గొణిగాడు. అతనికి కోపం వచ్చినట్లుందని భావించి నేను దగ్గిరికి వెళ్లి వీపు మీద తట్టి ఓదార్చాను. జిమ్ కొంతసేపైన తరవాత ఇలా అన్నాడు:

"చూశావా హక్! టామునోరు ఎలా మాట్లాడుతున్నాడో! ఒకేరోజున ఒకచోట సోమవారం, ఇంకోచోట మంగళవారమూ అవుతుందట. వేళాకోళానికిదేనా సమయం? అసలే ఈ దిక్కుమాలిన విమానంలో వాడిలిపోయి వస్తుంటే, ఇప్పుడీనా ఆయన వేళాకోళా లాడటం? ఒకరోజు చేసి రెండుముక్కలో ఒక రోజులోకి రెండురోజుల్ని ఎలా ఇరికిస్తారో చెప్పు. ఒక

# ★ టామ్ సాయర్ ప్రపంచయాత్ర ★

గంటలోకి రెండుగంటల్ని ఇరికించలేమే, ఒకరోజులోకి రెండురోజుల్ని ఎలా తీసుకురాగలం? ఒక సీసాలోకి ఇద్దరు సీసాల్ని తీసుకురాగలరా? రెండు గాలన్ల విస్కీని ఒకగాలన్ పాత్రలోకి ఎక్కించగలరా? ఊహు. అలాగే యిదీను. చూడు హాక్! మంగళవారంనాడు సంవత్సరాది అయిందనుకో. అంటే ఒకచోట కొత్తసంవత్సరమూ ఇంకోచోట పాత సంవత్సరమూ అవుతుందా? పైగా ఒక నిమిషంలోనే రెండు సంవత్సరాలా? ఇంతకంటె వెర్రితనం ఇంకెక్కడైనావుందా? ఆహా! ఎటువంటిమాటలు వింటున్నాను! ఎంత అవస్థపట్టింది నాకు!" అని దుఃఖించసాగాడు జిమ్.

హఠాత్తుగా మా కొక విచిత్రం కనబడింది. అందరం ఎగిరి గంతువేసి నుంచున్నాం. టామ్ ఇలా అరిచాడు:

"అరె. అదే అదే సముద్రం!" సముద్రం అనేసరికి నాకూ జిమ్‌కూ కాళ్లు గజ గజ కొట్టుకున్నాయి. అయినా తమాయించుకున్నాం. అంతకుముందు మేమెప్పుడూ సముద్రాన్ని చూడలేదు. చూస్తామని కూడా ఎన్నడూ కలగనలేదు. అందుచేత సంతోష పరవశుల మయ్యాము. టామ్. మళ్ళీ అన్నాడు.

"అది సముద్రమే. అట్లాంటిక్ మహాసముద్రం! చాలా గొప్పగావుందిగదూ. మనమెక్కడ, మహాసముద్రమెక్కడ? సమ్మడానికి కూడా వీల్లేనంత గొప్పగా వుందిగదూ!"

సముద్రం కొంతసేపు కనిపించడం మానేసింది. దాని స్థానంలో నల్లటి పొగకనబడింది. క్రమంగా దగ్గిరికి వెళ్ళిన కొద్దీ అది జనసమ్మర్దంతో కిటకిటలాడుతున్న నగరమని గ్రహించాము. అబ్బ! ఎంతపెద్ద నగరం! నగరం చుట్టూరా బోలెడు ఓడలున్నాయి. అది న్యూయార్కు అవునా, కాదా అని కొంతసేపు వాదోపవాదాలు చేశాము. మేమలా వాదించుకుంటూ వుండగానే నగరం దూరానికి వెళ్ళిపోయింది. మేము అసలు సముద్రంమీదికి వచ్చాము. విమానం అమితవేగంతో పోతోంది. అంతవరకూ మేము ఆ దృశ్యాలన్నీ చూస్తూ తన్మయులమై ఉన్నాము. సముద్రం మీదికి వచ్చేసరికి ఒక్కసారిగా ఉలికిపడ్డాము. ప్రొఫెసరును కాళ్లావేళ్లాపడి వేడుకొన్నాము, మమ్మల్ని కనికరించి, విమానం వెనక్కి తీసుకుపొమ్మని, మా వూళ్లో మమ్మల్ని దిగబెట్టిపొమ్మని. మావాళ్లు మేము కనిపించకపోతే ఎంతో తల్లడిల్లి పోతారని, మాకేదైనా అపాయం సంభవించిందని తెలిస్తే బెంగపెట్టుకుని చచ్చిపోతారనీ చెప్పాము. ఎంత బతిమాలినా ప్రొఫెసరు దయతలచలేదు. రివాల్వరుతీసి మమ్మల్ని బెదిరించాడు. దాంతో వణుకుతూ వెనక్కివచ్చి ఎవరి స్థానంలో వాళ్లు నిలబడ్డాము.

నేల మాయమైపోయింది. దూరంగా ఒక గీత మాత్రరుగా మాత్రమే కనిపిస్తోంది. మాకింద విశాలమైన సముద్రం పరుచుకుని వుంది. ఎటుచూసినా సముద్రమే. కొన్ని వేల మైళ్ళవరకూ అంతా ఏక సముద్రమే. బ్రహ్మాండమైన తరంగాలు లేస్తూ పడుతూ వరవళ్లు తొక్కుతున్నాయి. అక్కడక్కడ కొన్ని ఓడలు కనిపించాయి. మరికొద్దిసేపట్లో ఓడలు కూడా వెనకపడ్డాయి. ఆకాశమూ, సముద్రమూ తప్ప మరొక వస్తువే కంటికి అగుపించలేదు. అంత విశాలమైన స్థలం, అంతభయంకరమైన స్థలం నేను జన్మలో చూడలేదు. (ఇంకావుంది)

# పెన్సిల్ మర

బాల జయరామిరెడ్డి

గోపికి ఆ రాత్రంతా సరిగ్గా నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు స్నేహితులకు తన క్రొత్త పెన్సిలు మర చూపిద్దామా అని ఉబలాటపడుతున్నాడు. గోపీవాళ్ళనాన్న ఆరోజే గుంటూరునుంచి వచ్చారు. వస్తూ గోపీకోసం ఒక పెన్సిలుమర పట్టుకొచ్చారు. ఆ మర చూడగానే గోపి ఎగిరిగంతేశాడు ఎవరూచూడకండా పెన్సిలు ముక్కు విరగ్గొట్టి, క్రొత్తమరతోటి మళ్ళీ చెక్కటం మొదలెట్టాడు. క్షణంలోనే పెన్సిలు ముక్కు పొడవుగా వచ్చేసింది. గోపీకి తృప్తికలుగలేదు, మళ్ళీ విరగ్గొట్టాడు. మళ్లీ చెక్కాడు. అరగంట గడిచేప్పటికి నిండుపెన్సిలు సగానికి తయారైంది. ఇంతలో అమ్మ అన్నానికి పిలిచింది. అన్నం కూడ సరిగ్గా తిన బుద్ధిపుట్టలేదు. తన క్రొత్త పెన్సిలు మరతో స్నేహితుల్ని ఎలా ఆకర్షించాలా అని ఆలోచిస్తూ పడుకొన్నాడు. చివరకు నిద్రపోయాడు. ఒక గమ్మత్తైన కలవచ్చింది. కలలో పెన్సిలు మరకూడ కనిపించింది.

ఆరుగంటలకు అమ్మ లేపకుండానే గోపీకి మెలకువొచ్చింది. ప్రతిరోజూ అరగంటలేటుగా, ఎనిమిదిన్నరకు బడికివెళ్లే గోపి ఈరోజు ఏడింటికే బయలుదేరాడు. బడి తలుపులు తీసే ఉన్నాయి, గాని అప్పటికి ఎవరూ రాలేదు. ఒళ్లో ఎవరూ లేకపోయేటప్పటికి గోపీకి కోపమొచ్చింది. "నేనే గనక పంతులుగారినైతే ఏడు దాటిం తర్వాత వచ్చేవాళ్లనందరిని మోకాళ్లమీద కూర్చోపెడతాను" అనుకున్నాడు. ఎలాగైతేనేం చివరకు మెయిన్ గేట్లో మాటలు వినిపించాయి. గోపీ తొందరగా చాక్ పీసులు, దారాలు, బ్లేడులు మొదలగుసామాను పెట్టుకొనే పెట్రోమాక్సు లైటువత్తుల పెట్టెలోనించి జాగ్రత్తగా పెన్సిలు మర బయటకు తీసి, అటువేపు తిరిగి, పెన్సిలు చెక్కుకుంటున్నట్లు నటిస్తున్నాడు. దాసు, రాముడు ఇంకా నలుగురైదుగురు లోపలకొచ్చారు. "నేను సిరి, నువ్వుచుక్కా" అనుకొంటూ. కాని అప్పటికే వచ్చివున్న గోపీని చూసి టక్కున ఆగిపోయారు. రాముడు గోపీచేతిలోఉన్న మర చూశాడు. అంతకుముందెప్పుడూ వాడు అటువంటి మర చూడలేదు. (అది పల్లెటూరుబడి.) ఐదో తరగతిలోఉన్న పిల్లలందరిలోనూ అటువంటి మర గోపీ ఒక్కడిదగ్గరే ఉంది! గోపీ ఆ మరతో పెన్సిలు చెక్కటం అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. గోపీ సినిమా నడిపేవాడిలాగా ఠీవిగా నిలబడి పెన్సిలు చెక్కుతున్నాడు. ఆఖరుకు పెన్సిలును సున్నగా, సన్నగా చెక్కేసి స్నేహితుల వంక గర్వంగా చూశాడు. ఆ దెబ్బతో స్నేహితులందరికీ గోపిమీద గౌరవం కలిగింది. ఎవరికీ నలిచి దుమ్మయినా పెట్టనిదాసు గోపీకి, ఉప్పూ కలిపిన చింతపండు పొట్లంవిప్పి సగం పెట్టాడు. అదిచూచి రాముడు తన



దగ్గరున్న కందిపప్పంతా గోపీకే పెట్టేశాడు. గోపి విజయగర్వంతో హీరోలాగా నిలబడ్డాడు.

"నన్ను ఒక్కసారి దాన్ని పట్టుకొని చూడనియ్యవురా గోపీ?" అన్నాడు రాముడు జారిపోతున్న లాగును పైకి లాక్కుంటూ. గోపీ దాన్ని జాగ్రత్తగా రాముడి చేతులో పెట్టాడు. వాడు ఇంకా జాగ్రత్తగా దాన్ని చూసి మళ్లీ గోపికి ఇచ్చాడు.



"మరే, మరే, నన్నూ చూడనియ్యవ్?" చింతపండు పెట్టాను కదా అనే నమ్మకంతో దాసుకూడ అడిగాడు, ముక్కు పైకి ఎగపీల్చుకొంటూ. గోపీకి వెంటనే ఒకవిషయం గుర్తుకొచ్చింది. మొన్న దాసు ఒక చుక్కాని తీసుకొచ్చాడు. దాన్ని చూడనిమ్మని గోపీ ఎంత బ్రతిమాలినా ఇవ్వనంటే ఇవ్వనన్నాడు. ఆవిషయం గోపీ మనసులో ఉంది.

"ఇయ్యను" అన్నాడు గోపి.

"మరే నా చుక్కాని చూడనిస్తాగా"

చుక్కాని పాతబడిపోయింది. దాన్ని చూడాలనే కోరిక ఇప్పుడు గోపీకి లేదు. "ఉహుఁ" అన్నాడు.

దాసుకు ఆతృత ఎక్కువైంది. ఎలాగైనా ఆ పెన్సిలు మరనుసంపాదించాలనే కోరిక కలిగింది. కాసేపు ఆలోచించాడు.

"మరే నా చుక్కాని, రెండు బలపాలు ఇస్తాను. నీ పెన్సిలుమర ఇస్తావా?" అన్నాడు దాసు.

"ఇయ్యను" అన్నాడు గోపి దృఢంగా.

గోపీ ఇవ్వ నంటున్నకొద్దీ దాసుకు కావాలనేకోరిక ఎక్కువౌతూంది. మొదట అడిగినరేటుకు ఒక తళుకుకాగితం కలిపి మొత్తం - ఒక చుక్కాని, ఒక తళుకుకాగితం, రెండు బలపాలు ఇస్తానన్నాడు. కాని గోపీ ఒప్పుకోలేదు. దాంతో గోపీ ప్రతిభ ఎక్కువైంది. పిల్లలందరిలోనూ గోపికి ఒక ప్రత్యేక స్థానం ఏర్పడింది. అవును మరి. అంతమందిపిల్లల్లోనూ, పెన్సిలుమర వున్నవాడు గోపీ ఒక్కడేనయ్యె! ఇదంతాచూసి దాసుకు కోపం వచ్చింది. ఏడుపుకూడ వచ్చేసింది.

"మరే మానాన్నకి చెప్పి నేనూ కొంటాగా అటువంటిది" అన్నాడు ఏడుపుముఖంపెట్టి.

"కొనుక్కో, ఫో" గోపీ అన్నాడు నిర్లక్ష్యంగా.

ఇంతలో పంతులుగారొచ్చారు. అందరూ గప్‌చిప్‌గా బల్లలమీద కూర్చున్నారు. పంతులుగారు కళ్ళజోడు సరిజేసుకొని, ఒక్కపట్టు నస్యం పీల్చారు. కాళ్లు రెండూ టేబిలుమీదపెట్టి 'చదవరా' అన్నాడు ముందువరసలోకూర్చున్న కుర్రవాణ్ణి ఉద్దేశించి.

గోపీ తన పెన్సిలు మరను, అందరూ చూడటానికిగాను బల్ల మీదపెట్టి పాఠం వింటున్నట్లు నటిస్తున్నాడు. కుఱ్ఱవాళ్ళ కళ్ళన్నీ పెన్సిలుమరమీదనే ఉన్నాయి. బడి వదిలిపెట్టాక పిల్లలందరూ మళ్ళీ గోపీచుట్టూ చేరారు.

నాలుగైదు రోజులు గడిచిపోయినై. గోపీకి క్లాసులో పలుకుబడి ఎక్కువౌతూంది. పిల్లలందరూ గోపీస్నేహానికే వస్తున్నారు. గోపీ ఒక్కసారి పెన్సిలు చెక్కిపెట్టినందుకు పది బలపాలు తీసుకొంటున్నాడు. ఇప్పటికే నూట అరవై బలపాలు పోగయినాయి. కాని దాసుమాత్రం గోపీతో సరిగ్గా మాట్లాడటం లేదు. ఒకరోజు రాముడు గోపీదగ్గరకొచ్చి "చూశావ్‌రా? నీ మర చూస్తే దాసుగాడికళ్లు కుట్టినయ్. దిష్టికూడ తగులుతుంది" అన్నాడు రహస్యంగా.

"నిజమేరా!" గోపిగూడ అలాగే అనుకొన్నాడు.

ఒకరోజు గోపి బడికి వచ్చేటప్పటికి దాసు చుట్టూ చాలమంది పిల్లలు గుంపుగూడి ఉన్నారు. గోపీనిచూసి కొంతమంది ఇటు తిరిగారు. గోపీ ఏమిటా అని ఆలోచిస్తున్నాడు. దాసు చేతిలో ఒక పెన్సిలు మర పట్టుకొని సగర్వంగా గోపీవంక చూస్తున్నాడు. గోపీకి ఆశ్చర్యం వేసింది. తన సామాన్ల పెట్టెతీసి చూశాడు. దానిలో పెన్సిలుమర కనిపించలేదు. దాసుకు దగ్గరగావచ్చి అతనిచేతిలో మర వంక చూశాడు. అది తనదే! అదేరంగు - ఎఱుపు! గోపీకి పట్టరానికోప మొచ్చింది. ఐతే దాసు దొంగతనం చేశాడన్నమాట! ఇంకా చూడు సిగ్గులేకుండా ఎలా చూస్తున్నాడో! గోపికి ఉద్రేకంలో ఒళ్లు తెలియలేదు. దాసు మీదకొస్తూ "నామర నాకిచ్చెయ్" అని అరిచాడు. దాసుముందు తెల్లబోయి అంతలోనే తేరుకుని పెన్సిలుమరను జేబులో వేసుకున్నాడు.

గోపీ కోపంతో "చూడరా రాముడూ! నామర దొంగిలించి ఇంకా భయంలేకుండా బడికిగూడ తీసుకొచ్చాడు. దొంగవెధవ!" అన్నాడు.

"కాదురా. మరే నిన్న మా నాన్న కొనుక్కొచ్చాడు. కావాలంటే కిష్టాయ్ నడుగు. ఏంరా కిష్టాయ్" అన్నాడు దాసు.

కిష్టాయ్ నిజమేనని తల ఊపాడు. కాని గోపీ నమ్మలేదు. అన్నీ అబద్ధాలు. నాది నాకిచ్చెయ్" అని దాసు మీద విరుచుకపడ్డాడు. దాసు గోపి ముఖంమీద గిచ్చాడు. ఇద్దరూ దెబ్బలాటకు దిగారు. యుద్ధం భీకర ఘట్టంలోపడేటప్పటికి 'పంతులు గారు, పంతులుగారు' అని కేకలు

పెన్సిలు మర

వినిపించాయి. నిమిషంలో క్లాసంతా నిశ్శబ్దమైపోయింది. గోపీ బుగ్గమీద కారే నెత్తురు మోచేత్తో తుడుచుకున్నాడు. దాసు చినిగిపోయిన చొక్కాని ఏడుపుముఖంతో చూసుకొంటున్నాడు. పంతులుగారు ఒక పట్టు నశ్యంపీల్చి, బెత్తాంతో బల్లమీద గట్టిగాకొట్టి 'ఏమిటిదంతా' అని అరిచాడు. ఎవరూ మాట్లాడలేదు. పంతులుగారు గోపీకేసిచూసి "చెప్పవేంరా దున్నపోతా," అన్నాడు.

గోపీ ఏడుస్తూ "దాసు నా పెన్సిలు మర తీసుకొన్నాడండి" అన్నాడు.

"ఏంరా దొంగవెధవా?" అన్నాడు పంతులు దాసువంక చూసి.

"ఒట్టిదేనండీ. మరే నిన్నే, మా నాన్న, గుంటూరులో కొనుక్కొచ్చాడండి" అన్నాడు దాసు ఏడుపు దిగమింగుకొంటూ.

పంతులుగారికి ఏమీతోచలేదు. ఒకపట్టు ఘాటైన నస్యం పీల్చి ఆలోచించి, చివరకు మిగతాపిల్లల్ని అడిగారు. పిల్లలంతా - ఒక్కకిష్టాయ్యతప్ప - పెన్సిలుమర గోపీదేనని సాక్ష్యం చెప్పారు. పంతులుగారు ఆ మరను గోపీకి ఇప్పించారు. దొంగతనంచేసినందుకు దాసును మోకాళ్లమీద నిలబడమని ఆజ్ఞా

పించారు. దాసు పాపం చేసేదేమీ లేక మోకాళ్లమీద నిలబడ్డాడు. గోపీ తగిలిన దెబ్బలు మర్చిపోయి, గర్వంగా నవ్వుతూ దాసువంక చూశాడు. 'నా గొప్పతనంచూడు' మన్నట్లుగా. దాసు లోలోపలే వెక్కి-వెక్కి ఏడుస్తున్నాడు. బడి ఒదిలినతరువాత దాసు ఎవరితోనూ మాట్లాడకండా, కళ్లు తుడుచుకొని ఇంటిముఖం పట్టాడు.

రెండురోజులతరువాత గోపి కాపీ పుస్తకం కనిపించలేదు. గోపీ ఇల్లంతా వెదికాడు. ఎక్కడా కనిపించలేదు. ఈ సంగతి మరునాడు రాముడితో చెప్పాడు.

"ఆ దాసుగాడే మళ్లీ తీసుకొని ఉంటాడు. నువ్వు పంతులుగారితో చెప్పి మోకాళ్లమీద కూర్చోపెట్టించావని అసలే కోపంగా వున్నాడు" అన్నాడు రాముడు. దాసుగాడికి ఏవిధంగా తగినశాస్తి చేయాలా అని ఇద్దరూ తీవ్రంగా ఆలోచించారు. చివరకు ఒక నిశ్చయానికి వచ్చారు.

మరునాడు క్లాసులో, దాసు బయటికివెళ్లినపుడు రాముడు వాడి లెక్కల పుస్తకంతీసి గోపీకిచ్చాడు. బడి ఒదిలిపెట్టినతరువాత దాసు తన పుస్తకాలన్నీ చూసుకొన్నాడు. లెక్కలపుస్తకంలేదు. కాని దొంగచూపులుచూస్తూ ఇంటికి వెళ్లుతూన్న గోపీని చూశాడు. అనుమానం తీరిపోయింది. అంతలోనే గోపీ చాలదూరం వెళ్లిపోయాడు. పంతులుగారితో చెప్పినా దాసు మాట నమ్మరు. పైగా దాసునే తంతారు. అందుచేత పాపం దాసు గప్‌చిప్‌గా నోరుమూసుకొని ఊరుకొన్నాడు.

సాయంత్రం బళ్లో పంతులుగారు, ఇంటికిచ్చిన లెక్కలు చూపించమని అడిగారు. పిల్లలంతా చూపించారు. రాముడూ, గోపీ, దాసువంక చూస్తున్నారు. పంతులుగారు దాసునుగూడ చూపించమన్నారు. కాని దాసుదగ్గర పుస్తకం లేదు. ఎక్కడోపోయిందని చెప్పాడు. కాని పంతులుగారు దాసుమాట నమ్మలేదు. చప్పేటట్లు బెత్తంతోకొట్టి గోడకుర్చీ వేయించారు. ఐనా పాపం దాసు ఒక్కమాటగూడ గోపీమీద చెప్పలేదు. ఏడుస్తూ అలాగే గోడకుర్చీ వేశాడు. అది చూసింతర్వాత గోపీ మనస్సు కరిగిపోయింది. నిజం చెబుదామా అనుకొన్నాడు. కాని వెంటనే, దాసు తన పెన్సిలు మర దొంగలించటం గుర్తుకొచ్చింది. గోపీ మెదలకుండా ఊరుకొన్నాడు. బడి ఒదిలినతరువాత దాసు వెక్కి-వెక్కి-ఏడుస్తూ ఇంటికి పోయాడు. గోపీగూడ బరువెక్కిన గుండెతో ఇంటికి చేరాడు.

వసారాలో గోపీతల్లి పాపను ఒళ్లో కూర్చోబెట్టుకొనిఉంది. గోపీని చూసి "వెధవా. ఇంట్లో ఎక్కడ చూసినా నీసామానే! ఇలా పారేస్తావు మళ్లీ కొనమని ఏడుస్తావు! ఇదుగో ఈ పెన్సిలు మర తీసుకో. కొంచెంవుంటే పాప దీన్ని మింగి వేసేదే" అంటూ గోపీ చేతికి ఎఱ్ఱని పెన్సిలు మర ఇచ్చింది. గోపీకి ఆశ్చర్యం వేసింది. తను పెన్సిలు మర ఎప్పుడు బయటవేశాడో గుర్తులేదు. అమ్మ ఇచ్చేదాకా తన పెట్టెలోనే ఉందనుకొంటున్నాడు! వెంటనే మర తీసుకొని సామాన్లు పెట్టెలోవేద్దామని పెట్టె తెరిచాడు. కానీ ఆశ్చర్యమేమంటే తనమర తన పెట్టెలోనే ఉంది! మరి రెండోమర ఎక్కడనుంచి వచ్చింది? - గోపీ ఆలోచించాడు. దాసు వాళ్ళనాన్న కొన్నాడని ఎంతచెప్పినా నమ్మలేదు. ఐతే నిజంగా ఆమర దాసుదే నన్నమాట! కిష్టాయ్‌మాటలుగూడ అబద్ధమనుకొన్నాడు. గోపీ తల తిరిగిపోయింది. దాసు వెక్కి-వెక్కి-ఏడవటం, తను వాడిలెక్కల పుస్తకం దొంగిలించటం, వాడు ఏడుస్తూ గోడకుర్చీవేయటం అన్నీ గుర్తుకొచ్చాయి. గోపీ కళ్లవెంబటి నీళ్లుకారినై. పుస్తకాలు ఇంట్లోకి విసరివేసి, రెండు పెన్సిలుమరలూ, పట్టుకొని గోపీ దాసు ఇంటివేపు పరుగు తీశాడు. ★

---

"అమ్మా! ఈ మబ్బులు ఎప్పుడూ ఇక్కడే ఉండవుగదా! ఎక్కడికిపోతాయి?"

"అవి గాలి వీచిన దిక్కుకు పోతుంటాయి. ఇంకా తెలుసుకోవాలంటే మీనాన్న ఇంటికి వచ్చినతరువాత అడుగు."

* * *

క్లాసులో అబద్ధమాడని వాళ్లను చెయ్యెత్తమన్నాడు మేష్టారు. వెనుకసీట్లో ఒక్క పిల్లవాడుతప్ప అందరూఎత్తారు.

మే: ఏమిరా అబ్బాయ్, నువ్వు చెయ్యెత్తలేదేం?

పి. నేనబద్ధమాడదలచుకోలేదండీ.

—యం. నరసింహారావు, హైదరాబాద్.

---

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 196. శకునములు, వగైరా

చాలామంది శకునములు, బల్లిపాటు, తుమ్ము, జ్యోతిషమూ నిజమా అని అడుగుతున్నారు. విజ్ఞానశాస్త్రానుగుణమైన జవాబిస్తాను, అవగాహన చేసుకోండి. శకునములూ, బల్లిపాటూ, తుమ్మూ హఠాత్సంభవాలు. నేను పనిమీద బయలుదేరడానికీ, నాకెదురుగా ఒక తెలుకులవాడో, కావడి కాపో రావడానికీ సంబంధ మెక్కడేదీ; రెండూ ఒకమారు జరగడము...ఇలాగే బల్లిపాటూను. బల్లి ఇంటి లోకప్పుమీద పాకగలదు. దాని పాదములు చక్కగా గోడకు అంటించి, పాదమునకు నగుమనున్న చర్మాన్ని లోపలికి కుంచించగలదు బల్లి. పైగాలియొక్క ఒత్తిడివల్ల బల్లి గోడకి పట్టి ఉంటుంది. గాజుపలకమీద పాకే బల్లిని అవతలవైపునుంచి భూతద్దముతో పరిశీలిస్తే తెలిసేదిది. అయితే బల్లి పడడమంటూ ఎలాగు జరుగుతుందీ? ఎరను చూచి గాని, గభీమని తంటాలు పడిపడి పట్టిగాని, మన అలికిడి విని పారిపోవడానికి గాని, బల్లి తొందరగా పాకుతున్నప్పుడు—మనము మాట్లాడుతూ తొందరలో ఒకప్పుడు నాలిక నిపళ్లసందునుండి తప్పించడము మరచినట్లే అరికాళ్ళను లోపలికి కుంచించడము మరిచిపోతుంది బల్లి. అందువల్ల కిందపడుతుంది. సరిగ్గా ఆ సమయానికి మనము క్రిందనుండడము తటస్థించినట్లైతే మనమీద పడుతుంది. మనము అక్కడ లేకపోతే టప్పుమని నేలమీదే పడుతుంది...తుమ్ము రావడానికి లోముక్కులో చిన్న కలత ప్రారంభము కావడము కారణము. ఎవరైనా ఒకపని ప్రారంభించడానికీ ఇంకొకరు తుమ్మడానికీ సంబంధము వేరేమీ లేదు. హఠాత్తుగా ఒకటి కావడమే. ఇలాగే జ్యోతిష్కులను సరిగా ఒక ప్రత్యేక నిముషములో అడిగే ప్రశ్నకీ, ఆ సమయంలోని గ్రహస్థితికీ ఏ సంబంధమూ లేదు. హఠాత్తుగా కలవడము తప్ప. ఇద్దరిమాటలు ఒకటి కావడమూ, భోజనసమయంలో పలమారడమూ ఇలాంటవే.

పురుషప్రయత్నము వల్లకాక వాటంతటికి అవే జరిగే ఘటనలన్నీ దైవికాలని మన ప్రాచీనులు నమ్మినారనిపిస్తుంది వీటన్నిటినీ పరిశీలిస్తే. బలి సరిగ్గా ఆసమయానికే పడడమూ, తుమ్ము ఆసరికే రావడమూ, ప్రశ్న ఆసమయానికే జ్యోతిష్కునికి వినబడడమూ ఇవన్నీ దైవికాలనీ కాబట్టి ఆ ఘటనలకు బలముంటుందనీ వారి నమ్మకంలాగ కనబడుతుంది.

నేటి గణితశాస్త్రజ్ఞులు "బహుశా జరగడానికి వీలున్న" ఘటనలను లెక్కలుగట్టి వాటి తరచుతనము నిర్ణయిస్తున్నారు. ఒక పల్లెలో వందమంది ఉన్నారు. వారిలో ఇద్దరు తారసిల్లడానికిగల అవకాశమును (*Probability*) లెక్కకట్టి నిర్ణయిస్తున్నారు. ఒక నాణెమును లక్షసార్లు ఎగరవేస్తే ఈ అవకాశపు అంచనాలనుబట్టి, ఏబది వేలసార్లు బొమ్మ ఏబది వేలసార్లు బొరుసూ పడుతుంది. అలాగే మన యిళ్ళలాంటి ఇళ్లలో నివసించే వారిలో ఒకరిమీద, ఆ యింటికప్పులో నివసించే బల్లులలో ఒకటి పడడానికిగల అవకాశాన్ని కూడా లెక్కగట్టవచ్చునన్నది నేడు సాధ్యముకాకపోయినా ఊహాతీతముకాదు. అంటే చెప్పవచ్చేది, ఇందులో దైవికమేమీ లేదని. హఠాత్సంఘటనలు మానవుని బుద్ధివల్ల లెక్కగట్టడానికి వీలయినవేగాని దైవికాలు కావు. వీటికి దివ్యత్వమాపాదించడము, వాటిని అర్థము చేసుకోలేనన్నాళ్ళూ మంచికో చెడ్డకో జరిగింది, నేడెందుకూ?

జబ్బులు నివారణ కావడానికి తాయెత్తులూ రక్షరేకులూ కట్టడమూ, భూతవైద్యులకడకు పోవడమూ నేడు తగ్గిందంటారా లేదా? ఎందుకు తగ్గిందీ? కారణాలుపట్టి వాటిని నిర్మూలించే వైద్యము యొక్క ప్రచారమువల్ల. నిన్న కలరా అంటే భయము: "మారి." నేడు మంచి హాస్పటలు చేరువన ఉంటే రెండుకోజుల పాటు ఉప్పునీరు అలాగ శరీరంలోకి ఎక్కించుతారు. అంతేనట మందు! కుదిరిపోతోంది! మారియమ్మ ఏమైనట్టూ? నిన్న స్ఫోటకము "అమ్మవారు" నేడు లివర్ కషాయముతో అణచిపెట్టుచున్నారు అమ్మవార్ని. (నెల్లూరు జిల్లావారు తిట్టి చెవర గొట్టుతారట!)

ఏతావాతా తేలేదిది. వివరించడానికి సాధ్యముకానివన్నీ దైవికాలుకావు. వాటిని దైవికాలనుకోవడము అజ్ఞానము.—మానవవిజ్ఞానము వికసించినకొద్దీ ఇవి సాహాస్యాలయిపోతాయి.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## చిట్టిప్రశ్నలకు జవాబులు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

కె. రామారావుగారు—కొత్తగూడెం.

—మరణానంతరము ఇంకొక జన్మకలదను నమ్మకము కేవలమూ నమ్మకము మాత్రమే! పంజాబు కన్య పూర్వజన్మములో తన భర్త ముత్రీలో ఉన్నాడని తండ్రికి చెప్పి, ఆయనను తీసికొనివెళ్ళి వారిని గుర్తించి చూపినట్లు ప్రచురింపబడ్డ వార్త వార్తమాత్రమే అనవలసివస్తుంది. వినుంటారా? ఇంకొక జన్మము లేదన్న నమ్మకముగల మహమ్మదీయులలోనూ క్రైస్తవులలోనూ ఇటువంటి కన్యలు పుట్టనే లేదు.

జన్మాంతరము వున్నదనే నమ్మకము, మృతశరీరము అతి శీఘ్రముగా కుళ్ళి నశించిపోవు ఉష్ణప్రదేశములలో నున్న వారికి మాత్రమే ఉన్నట్లు కనబడుచున్నది. వైదిక మతస్థులూ, బౌద్ధులూ ఈ కోవలోనివారు. ఈజిప్టు దేశములో మృతశరీరమునకు ఏవో మూలికారసములను పూసి మమ్మీలను చేసి చిరకాలము చెడిపోకుండా ఉంచు అలవాటు ఉండేది. ఆ శరీరము కనబడుతూ వుండగా ఆ శరీరములో నివసించియుండిన జీవుడు ఇంకొక శరీరములో ప్రవేశించియుండునని యూహించుట విపరీతముగా కనబడునుకదా! అందువలననే ఆ జాతులవారు మరణానంతరము ఇంకొక జీవనము ఉన్నదని నమ్మినప్పటికీ ఇంకొక శరీరనివాసము మాత్రము నమ్మియుండలేదు. ఈజిప్టుదేశపు రాజ సమాధులలో ఆ రాజు బ్రతికియుండినప్పుడు అభిమానించిన వస్తుసామగ్రిని వర్ణచిత్రములను సంగీతోపకరణములను గ్రంథావళినీ ఉంచుట పరిపాటి. తరలిపోయిన జీవులు తమ మృతశరీరమును చూచుకొనుటకు వచ్చి ఆ సంభారములన్నిటినీ ఉపయోగించి ఆనందింతురని ప్రాచీన ఈజిప్టు దేశీయుల నమ్మకము.

యూరోపా ఖండములోని పరిస్థితులు వేరు. మృతశరీరమును పాతిపెట్టినను అవి చలిదేశములు కనుక ఆ శరీరములు కుళ్ళవు. అందువల్లనే మృతులందరూ సమాధులలో నుందురనియు విచారణదినము (*Jwdgement day*) నాడు భగవంతుడు జీవులనన్నిటినీ లేపి వారు బ్రతికియుండినప్పుడు చేసిన పుణ్యపాపములకు అనుగుణముగా స్వర్గనరకములను ప్రసాదించునన్న నమ్మకము ఆ జాతులకు కలిగియుండవచ్చునని ఊహించవచ్చును కదా!

# అదీ - ఇదీ

—ఎన్నార్

## రాజ్యసభ తీర్మానం

అవాంఛనీయ చిత్రాలను తీవ్రంగా నిరసిస్తూ వాటిని నిషేధించడానికి ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని కోరుతూ ఇటీవల రాజ్యసభవారు ఒక అనధికార తీర్మానం చేశారు. శ్రీమతి లీలావతి మున్షీ ప్రవేశపెట్టిన ఒక తీర్మానంమీద తర్జనభర్జనలు జరిగినతర్వాత, దాని స్థానంలో పి. కె. ధాగే తెచ్చిన మరొక తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

"అవాంఛనీయ చిత్రాల ప్రదర్శనంవల్ల దేశంలో నైతికమైన విలువలు చాలవరకు దెబ్బతిన్నాయని సభవారు అభిప్రాయపడుతున్నారు. అటువంటి చిత్రాలను భారతదేశంలో తయారైనవైనా, ఇతరదేశాలనుండి దిగుమతి అయినవైనా, వాటిని నిషేధించడానికి శాసనంద్వారా గాని, ఇతరమార్గాలలోగాని ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకోవాలని సభవారు సూచిస్తున్నారు. విజ్ఞానదాయకమై వుంటూ వినోదకరంగాకూడా వుండే చిత్రాల నిర్మాణానికి ప్రోత్సాహమూ, సహాయమూ కలిగించాలనికూడా సభవారు సలహా ఇస్తున్నారు." రాజ్యసభ తీర్మానానికి ఇది పూర్తిపాఠం.

శ్రీమతి మున్షీ ప్రవేశపెట్టిన తీర్మానంపై పలువురు పలురకాల అభిప్రాయాలు వెలిబుచ్చారు. కాని ఒక్క పృథ్వీరాజ్ కపూర్‌ను మినహాయిస్తే అందరూ తీర్మానపు సారాంశంతో ఏకీభవించారు. హెచ్. సి. మథుర్ (రాజస్థాన్) అనే ఆయన మాత్రం సినిమాలవలన నైతికస్థాయి పడిపోతున్నదనే ఆరోపణకు శ్రీమతి మున్షీ నిదర్శనాలు చూపించలేదని, ఇప్పటికే సెన్సార్లు బాగా కఠినంగా వుంటున్నారని నిర్మాతలు ఫిర్యాదు చేస్తున్నారనీ, ప్రభుత్వం చెయ్యగలిగిందల్లా అవాంఛనీయమైన భాగాలను తొలగించడం మాత్రమేననీ అన్నారు.

పృథ్వీ రాజ్ కపూర్ మాట్లాడుతూ ప్రజలకు విద్యాదాయకంగా వుండే మంచి చిత్రాలను నిర్మించేందుకు ప్రోత్సాహమూ, ఆర్థిక సహాయమూ ఇవ్వాలిగాని ఇటువంటి నిరసనవైఖరి ఏమాత్రమూ సహాయపడదని వాదించారు.

ప్రభుత్వం సినిమా పరిశ్రమమీద ఇంకా ఎక్కువ అధికారాలు వహించాలని కొందరు సూచించారు. డా॥ కేస్కార్ చర్చలో జోక్యం కలిగించుకుని మాట్లాడుతూ, సినిమాలమీద ఇప్పటికంటె ఎక్కువ అధికారం వహించడానికి రాజ్యాంగం ఒప్పుకోదనీ, అలాటి అధికారం ఉండడం అవసరమని సభవారు భావిస్తున్నట్లయితే, దాన్నిగూర్చి ప్రభుత్వం చర్యతీసుకోగలదనీ అన్నారు. విదేశీ చిత్రాలకూ స్వదేశీ చిత్రాలకూ సెన్సారింగ్‌లో తేడా లున్నాయనే ఆరోపణకు సమాధానంగా, ఈ తేడాలను సాధ్యమైనంత కనీసపు పరిమితికి తగ్గించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోం



"సతి సక్కుబాయి"లో రుక్మిణీ సమేతుడైన శ్రీకృష్ణుడుగా కె. రఘురామయ్య.

""మిస్సమ్మ" లో జమున, బాలకృష్ణ, నాగేశ్వరరావు.



## అదీ - ఇదీ



దనీ, ఇకముందు ఇటువంటి తేడా ఉండబోదనీ హామీ ఇచ్చారు.

*　　*　　*

### వాసన్ గారి ఖండన

ఈ తీర్మానం ఆమోదింపబడిన రెండు రోజులకి భారత ఫిలిం ఫెడరేషన అధ్యక్షుడు ఎస్. ఎస్. వాసన్ గారు జెమినీ స్టూడియోలో పత్రికా విలేఖరులను సమావేశపరిచి, తీర్మానాన్ని తీవ్రంగా ఖండిస్తూ మాట్లాడారు. అవాంఛనీయ చిత్రం అనేదానికి నిర్వచనం ఏమిటని ఆయన ప్రశ్నించారు. "ఈ ప్రశ్న రాజ్యసభలో డా|| కేస్కార్ అడిగినప్పుడు తీర్మాన ప్రతిపాదకురాలు శ్రీమతి ముసీ సమాధానం చెప్పలేదు. కేవలం విద్యాదాయకమూ, సంస్కారణాత్మకమూ అయిన చిత్రాలు నిర్మించబడాలని తాను కోరుతున్నట్లు మాత్రమే ఆమె చెప్పింది. అంటే విద్యాదాయకమూ, సంస్కారణాత్మకమూ కాని చిత్రాలన్నీ అవాంఛనీయ చిత్రాలేనని ఆమె ఉద్దేశ్యమా?" అని వాసన్ గారు ప్రశ్నించారు.

"ఈ దేశంలో ప్రదర్శించబడే ప్రతి ఒక్క చిత్రమూ సెన్సార్లు పరిశీలించి ఆమోదించిన మీదటే ప్రదర్శింపబడుతోంది. ఇక అవాంఛనీయత్వం ఎక్కణ్ణించి వస్తోంది? అటువంటిదేదైనా వుంటే సెన్సార్ బోర్డును విచారణ చెయ్యాలిగాని నిర్మాతలను కాదు. అవాంఛనీయ చిత్రాన్ని తయారు చెయ్యాలని ఏ నిర్మాతా ప్రయత్నించడంలేదు. వాంఛనీయ చిత్రాలను తయారు చెయ్యాలని మాత్రమే నిర్మాతల ఏకైకాశయం," అని వాసన్ గారన్నారు.

*　　*　　*

### పొలిటిక్సు దెబ్బ

రాజ్యసభలో ఏకగ్రీవంగా ఆమోదించబడిన తీర్మానం చాలా ముఖ్యమైనది. శాసనం ద్వారా గాని, ఇతర మార్గాలలో గాని అవాంఛనీయ చిత్రాలను నిషేధించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని అది కోరుతున్నది. అంటే కేంద్ర ప్రభుత్వం ఏవైనా చర్యలు తీసుకోదలిస్తే రాజ్యసభ వాటిని సమర్థిస్తుందని దీని అర్థం.

చలనచిత్రాలు ప్రజల నైతికస్థాయిని పడగొడుతున్నాయని కొంతకాలంగా వినవస్తున్న విమర్శల అలజడికి ఫలితమే ఈ తీర్మానం.

అయితే దేశంలో నైతికస్థాయి తగ్గిపోవడానికి ఒక్క చలనచిత్రాలే బాధ్యులైనట్లు ఈ తీర్మానం ఆరోపిస్తోంది. ప్రజ నైతికజీవనాన్ని యావత్తు సాంఘిక పరిస్థితులూ తీర్చిదిద్దుతాయిగాని ఒక్క చలనచిత్రాలు మాత్రమే కాదు. ఈ సాంఘిక పరిస్థితులను మార్చడానికి, ప్రజల సర్వతోముఖాభివృద్ధి సాధించడానికి ఏడేళ్ళుగా అధికారంలో వున్న జాతీయ ప్రభుత్వాలు ఎంతవరకూ కృషిచేశాయి? ఒకరకంగా చూస్తే అధికారంలో వున్నవారి అసమర్థ

తను, అలసతను కప్పిపుచ్చుకోడానికి, చలన చిత్రాలలోని చెడును ఈ ప్రముఖులందరూ ఒక సాకుగా మాత్రమే ఉపయోగించుకుంటున్నారని అనుమానించడానికి ఆస్కారం లేకపోలేదు. ఒక దేశపు నైతికస్థాయికి ఇంతగా భంగం కలిగించే శక్తి చలన చిత్రాల కున్నదని వీరందరూ నిజంగా భావిస్తున్నప్పుడు ఆ విషయమై తగినంత శ్రద్ధవహించని ప్రభుత్వాన్ని వీరు ఎందుకు విమర్శించరో తెలియడంలేదు. ప్రభుత్వం నిజంగా తలుచుకుంటే సినిమా పరిశ్రమపై ఇతోధిక అధికారాలు వహించడానికి రాజ్యాంగాలు అడ్డుపడతాయా? అందుచేత ఈ పరిస్థితి కంతటికీ ఒక్క సినిమా పరిశ్రమమీదనే బాధ్యతను రుద్దడానికి ప్రయత్నించడం అనుచితంగా కనిపిస్తోంది.

అసలు ఈ దేశంలో చలనచిత్రాల నిర్మాణం ప్రైవేటు వ్యాపార పద్ధతులమీద నడుస్తోంది కాని సంఘక్షేమమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న కళగా నడవడం లేదని మొదట గుర్తించవలసిన విషయం. చలనచిత్రం ఒక కళ, దానికి సంఘక్షేమమే పరమప్రయోజనం, అనేమాట నిజమే. అయినప్పటికీ, ఈ కళ మన దేశంలో ప్రైవేటు వ్యాపారస్థులచేతుల్లో ఉన్నంతకాలమూ, దాని పరమప్రయోజనం మరుగున పడిపోయి, వ్యాపారప్రయోజనమే ప్రధానమవుతుంది. రాజ్యాంగం వ్యాపారస్వేచ్ఛను అనుమతిస్తున్నది. కనుక సినిమాకళ వ్యాపారపద్ధతుల్లో నడవరాదని ఎన్ని నీతులు చెప్పినప్పటికీ అవి అసలులోకి రావు. వ్యాపారపద్ధతిపై నడిచే హాలీవుడ్ సినిమాకళ నైతికంగా ఎంత అధోగతికి దిగజారిందో, యువతీయువకుల మనస్సులను కల్మషం చేయడంలో అది ఎంత ప్రముఖపాత్ర వహిస్తున్నదో అందరూ ఎరిగినదే. సినిమాకళ కేవలం వ్యాపారం కాగూడదని నిజంగా కోరుతున్నట్లయితే దాన్ని జాతీయం చేసివెయ్యడం ఒక్కటే పరిష్కారమార్గం. అయితే ఇంత పెద్ద భారీ పరిశ్రమను, అందులో ఇంత విలక్షణమైన పరిశ్రమను జాతీయం చేయడానికి ప్రభుత్వం సంసిద్ధంగా వున్నదా? అది దీన్ని విజయవంతంగా నిర్వహించగలదా? ఈ సందేహాలన్నీ వస్తాయి. ప్రస్తుతం మాత్రం, సినిమా పరిశ్రమమీద ప్రభుత్వానికి కొన్ని కోట్లరూపాయల ఆదాయం వస్తున్నది. అవినీతికరంగావుంటున్నదని ప్రభుత్వమూ, ఇతరులు నిందించే ఈ పరిశ్రమ ప్రభుత్వానికి లాభదాయకంగా వున్నది. అందుచేత ప్రభుత్వం ఈ విషయంలో ఇప్పుడప్పుడే ఏమీ చేయలేదనే అనుకోవచ్చును.

## సెన్సార్లు ఏం చేస్తారు

ఇక సెన్సార్‌షిప్ సంగతి. సెన్సార్ల చేతుల్లోంచి ఇన్ని అవాంఛనీయ చిత్రాలెలా బయటికివస్తున్నాయి, అని వాంచూ గారు ప్రశ్నించారు. ఇన్ని న్యాయస్థానాలు, క్రిమినల్ కోడ్‌లు ఉండగా దేశంలో ఇంకా నేరాలెలా జరుగుతున్నాయి, అని ప్రశ్నించినట్లేవుంది ఈ ప్రశ్న. సెన్సార్‌షిప్ నిబంధనలలో ఏవేవి ఉండకూడదో మాత్రమే నిర్దేశించబడి వుంటుంది. ఏవేవి వుండాలో నిర్దిష్టంగా వుండవు. ఉండకూడనివి కనిపించినప్పుడు మాత్రమే సెన్సార్లు చర్యతీసుకుంటారు. ముద్దులు ఉండకూడదు అని నిబంధన నుల్లంఘించి ముద్దులను ప్రవేశపెట్టినప్పుడు ఆ భాగం కత్తిరిస్తారు. కాని ప్రేయసీప్రియులు గజం



శోభనం గదిలో నిద్రపోయాడు జడభరత



“మిస్సమ్మ” లో ఒక విషమ సన్నివేశం: జమున, రామారావు, సావిత్రి.

## ★ అదీ - ఇదీ ★

దూరంలో నిలబడి ముద్దులకంటే కామోద్రేకకరంగా ఒకరినొకరు చూసుకుంటున్నా, సంభాషించుకుంటున్నా, పాటలుపాడినా, నృత్యం చేసినా సెన్సార్లు అటకాయించలేరు. మన చిత్రాల్లో ముప్పాతిక మూడుపాళ్ళు ప్రేమ కథలు. వీటిని సెన్సార్లు అడ్డగించలేరు. ఒక జాతియొక్క విస్తృతమైన జీవితవిధానంలో స్త్రీపురుషుల లైంగిక సంబంధాలకు ఉంటున్న ప్రాధాన్యంకంటె ఎన్నోరెట్లు ఎక్కువ ప్రాధాన్యం చలనచిత్రాల్లో కనిపిస్తుంది. ఒక ఏడాది పాటు మన చిత్రాలు వరసగా చూసిన తరవాత భారతీయ యువతీయువకులకు ప్రేమించుకోడంతప్ప మరేమీ పనీ పాటా లేదా అని అనుమానం తగుల్తుంది. అన్ని చిత్రాలూ ఇలాగే వున్నాయని అనడం లేదు. అలా లేనిచిత్రాలు చాలాకొద్ది. ఈ పరిస్థితిని సెన్సార్లు ఎలా నిరోధించగలరు?

అదీగాక సెన్సార్‌షిప్ నిబంధనలను మన్నిస్తున్నట్లు కనబడుతూ, ఇతర విధాల వాటిని తోసి రాజనడానికే అనేకులు నిర్మాతలు ప్రయత్నిస్తున్నారు. ఉదాహరణకు, కొన్ని చిత్రాలలో ప్రేయసీ ప్రియులు పెదవులమీద ముద్దుపెట్టుకోవడం లేదు గాని బుజాలమీద ముద్దుల వర్షం కురిపిస్తానే వున్నారు ఒకరి బుజాలమీద ఒకరెక్కి ఊరేగుతూనే వున్నారు. కొన్ని కొన్ని నృత్యాల్లో నర్తకి చేసే అసభ్యమైన అవయవ చాలనాలు సెన్సార్ నిబంధనలకు అడ్డం రావు గాని ప్రజల అభిరుచుల ప్రమాణాన్ని పెంచడానికి తప్పకుండా అడ్డొస్తాయి. సెన్సార్‌షిప్‌ను ఎంత కఠినతరం చేసినప్పటికీ, పరోక్షంగా దాన్ని తోసిరాజనడానికే నిర్మాతలు ప్రయత్నిస్తారు.

కనుక ఇది సెన్సార్‌షిప్ విధాన సంస్కరణవలన పరిష్కారమయ్యే సమస్య కాదు. దీనికి నిర్మాతలలో తగినంత పరివర్తన రావాలి. పరివర్తన వచ్చేట్లు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి విద్యాబోధనకు ఉద్దేశింపబడిన ఉపాధ్యాయులకు కొన్ని కనీసపు అర్హత లుండాలని నిర్ణయించినట్లే, ప్రజల మానసిక వికాసానికి చలనచిత్రాలు ఉపయోగపడాలని భావిస్తున్న ప్రభుత్వం చిత్ర నిర్మాతలకుకూడా కొన్ని కనీసపు అర్హతలను నిర్ణయించాలి. ఈరోజున ఎవరు పడితే వారు ధనవంతులైతే చాలు, చిత్ర రంగంలోకి ప్రవేశించడానికి వీలున్నది. అలా కాకుండా ఫలానాఅర్హతలు, లక్ష్యాలు కలిగినవారే చిత్రనిర్మాణానికి అర్హులు అని శాసించినట్లయితే ఈసమస్యకు తావుండదు. ఉపాధ్యాయులకు ట్రెయినింగ్ ఇచ్చినట్లే, చిత్ర నిర్మాతలకు, దర్శకులకు, చిత్ర రచయితలకు శిక్షణ ఇవ్వాలి. పరిశ్రమ ఆర్థిక విషయాలమీద, తదితర శాఖలమీద ప్రభుత్వానికి అధికారం ఉండాలి. ఇవన్నీ జరిగితేనే గాని మన చలనచిత్రాల్లో ప్రభుత్వమూ, ఇతర విమర్శకులు ఆశిస్తున్న అభివృద్ధికర పరిణామాలు రావు.

సినిమాకళ కేవలం వ్యాపారంగా నడవడానికి ఒకవంక అనుమతిస్తూ, దానివల్ల వచ్చే అవాంఛనీయ ఫలితాలను మాత్రమే తొలగించాలని తీర్మానాలను, సెన్సార్‌షిప్ నిబంధలను, సినిమా వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగించడంవలన లాభం లేదు. ఈ పరిశ్రమను విప్లవాత్మకంగా సంస్కరించాలి. నిర్మాతలకు ఇబ్బందిగా ఉండే చర్యలను, వారిని రెచ్చగొట్టే చర్యలను ప్రవేశపెట్టినందువల్ల పని జరగదు.

రాజ్యసభలో డా॥ కేస్కార్ ఒక విషయం చెప్పారు. విదేశీ చిత్రాలకు, దేశీయచిత్రాలకు సెన్సారింగ్‌లో ఇకమీద భేదం ఉండదని ఆయన అన్నారు. ఇది హర్షించదగినదే కాని దీన్ని సర్వత్రా అమలుజరపడం కష్టసాధ్యం కావచ్చు. ఉదాహరణకు ముద్దుల సమస్య. చుంబనం లేని అమెరికన్ చిత్రాలు సాధారణంగా ఉండవు. బ్రిటిష్ చిత్రాలుకూడా అంతే. ఇలాగే దుస్తుల విషయం కూడాను. ఆడతార ఎంత తక్కువగా దుస్తులు ధరిస్తే అంత నాగరికంగా భావిస్తుంది హాలీవుడ్. వీటిని తొలగించడం పెద్దచిక్కే. ఇదికాక హింసా ప్రవృత్తిని ప్రకోపింపజేసే చిత్రాలుకూడా హాలీవుడ్ నుంచి చాలా వస్తాయి. వీటన్నిటినీ నిషేధించడం మొదలిడితే ఈ దేశంలో ప్రదర్శించడానికి వీలైన హాలీవుడ్ సినిమాల సంఖ్య జోత్తిగా తగ్గిపోతుంది. దీనివల్ల పెద్దనష్టం ఉందని కాదు. బ్రిటన్, ఇటలీ, జపాన్, రష్యా, ఫ్రాన్సు, జెకోస్లొవాకియా, చైనా మొదలైన దేశాలనుంచి కూడా చిత్రాలు ఎక్కువసంఖ్యలో రావడం మొదలుపెడితే అమెరికన్ చిత్రాలసంఖ్య తగ్గిపోయినామనకు నష్టంవుండదు. ప్రస్తుతం మాత్రం అమెరికన్ సినిమా పరిశ్రమ మన థియేటర్లను గుత్తకు పుచ్చుకున్నట్టు వ్యవహరిస్తోంది. ఇతరదేశాల చిత్రాలు ఈ దేశానికి ఎక్కువగా రావడానికే వీలులేకపోతోంది. ఆర్థికంగా బాగా స్తోమత కలిగి వుండడం ఒక్కటే అమెరికన్ చిత్రాలకు ఉన్న ఘనత. మరే దృష్టితో చూసినా అవి యూరపియన్ చిత్రాలకు, జాపనీస్ చిత్రాలకు తీసికట్టే. ఈ దేశంలో అచ్చగా అమెరికన్ చిత్రాలు మాత్రమే ప్రదర్శింపడుతూ వుండడంవల్ల మన చిత్ర పరిశ్రమకు అవొకటే ఆదర్శాలై కూర్చున్నాయి. ఇతరదేశాల చిత్రాలు కూడా విరివిగావస్తే వాటిప్రభావం మన పరిశ్రమపై కూడా పడి మనకుకూడా లాభిస్తుంది.

కనుక ఏవైనా చర్యలు తీసుకోబోయే ముందు ప్రభుత్వం చలనచిత్రాలపట్ల నిర్మాణాత్మకమైన, స్పష్టమైన, వైఖరి అవలంబించాలిగాని నిర్మాతలనొక్కరినే దోషులుగా భావించి, వారిచేతులు బిగించివేస్తే పరిస్థితిబాగుపడుతుందనే ధోరణిలో ప్రవర్తించరాదు. ★

## డాక్యుమెంటరీల సమస్య

సినిమా మందిరాల్లో డాక్యుమెంటరీ చిత్రాలను విధిగా ప్రదర్శింప జేయడానికి



"అన్నదాత" లో అంజలీదేవి, రంగారావు, కుటుంబరావు.



ఈ నెల 14 న మద్రాస్, ఓడియన్‌లో విడుదల కానున్న పారమౌంట్ వారి మొదటి విస్టావిజన్ చిత్రం "వైట్ క్రిస్టమస్" లో వేరా ఎలెన్, రోజీ. ఈ చిత్రంలో హాస్య నటులు బింగ్ క్రాస్బీ, డానీకేయీ మొదటిసారిగా కలిసి నటిస్తున్నారు.



## డాక్యుమెంటరీల సమస్య



వీలుగా మద్రాసు, ఆంధ్ర, తిరువాన్కూరు-కొచ్చిన్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు చర్యలు తీసుకుంటున్నాయని డా॥ కేస్కార్ లోక్‌సభలో ప్రకటించారు.

"గేట్లదగ్గిర వసూలైన సొమ్మును అనుసరించి వారం వారం ఎగ్జిబిటర్లనుండి అప్రూవ్డ్ చిత్రాలపై అద్దె వసూలు చేయబడుతున్నది. చిన్న ఎగ్జిబిటర్లవద్ద 5-0-0 నుండి పెద్ద ఎగ్జిబిటర్లవద్ద 150-0-0 దాకా ఈ అద్దె ఉంటున్నది. మొత్తం గేటు వసూళ్ళలో ఈ అద్దె నూటికి ఒకటి రెండు వంతులకంటె ఎక్కువ ఉండడం లేదు. చిన్న ఎగ్జిబిటర్లకు ఈ పద్ధతి కష్టంగా వుంటున్నదని, నూటికి ఒక వంతుకంటె ఎక్కువగా అద్దె ఉండగూడదని ఫిర్యాదులు వస్తున్నవి. ఈవిషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నది. అద్దెను తగ్గించినట్లయితే ఫిలిమ్స్ డివిజన్‌వారు కొన్ని లక్షల రూపాయల నష్టానికి సిద్ధపడివుండాలి," అని డా॥ కేస్కార్ చెప్పారు. ప్రైవేటు నిర్మాతలు డాక్యుమెంటరీ రంగంలోకివచ్చి చవుకగా చిత్రాలుతీస్తే అద్దె తగ్గించడం సులభమవుతుందనీ, ఉచితంగా ఈ చిత్రాలను సప్లయి చేయడం మొదలిడితే ప్రైవేటు నిర్మాతలకు డాక్యుమెంటరీ నిర్మాణంమీద అసలే శ్రద్ధఉండదనీ కూడా ఆయన అన్నారు.

జెమినీ స్టూడియోలో వాసన్‌గారు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, ఉచితంగా అప్రూవ్డ్ చిత్రాలను సప్లయిచేస్తే ఉచితంగా ప్రదర్శించడానికి తాము సుముఖులమనీ, అప్పటికీ బలవంతాన వాటిని తమకు అంటగట్టడం ఒప్పుకోమనీ, ఉభయులకూ సమ్మతమైన పద్ధతిలోనే డాక్యుమెంటరీల ప్రదర్శనం జరగాలనీ అన్నారు. ఈ చిత్రాలమీద ఫిలిమ్స్‌డివిజన్ వారికి ఏడాదికి 20 లేక 30 లక్షల రూపాయలకంటె ఎక్కువ ఖర్చుకాదనీ, ప్రజలలో విజ్ఞానవ్యాప్తికిగాను ప్రభుత్వం ఈమాత్రం ఖర్చు భరించాలనీ, ఆ ఖర్చును కేవలం 2000 మంది ఎగ్జిబిటర్లమీద మాత్రమే పడవెయ్యడం అన్యాయమనీ ఆయన అన్నారు.

## ఢిల్లీలో ఫిలిం గోష్ఠి

సంగీత నాటక అకాడమీ వారు 1955 ఫిబ్రవరిలో ఢిల్లీలో చలనచిత్ర గోష్ఠి (ఫిలిం సెమినార్) ఏర్పాటు చేస్తున్నారు. చలనచిత్ర పరిశ్రమకు, కళకు దోహదం చేస్తూ, వాటికి సంబంధించిన విషయాలను విపులంగా చర్చించడానికి ఈ గోష్ఠి ఏర్పాటు అవుతున్నది. ప్రముఖ ఫిలిం వ్యక్తులనేకులు ఇందులో పాల్గొంటారు.

న్యూ థియేటర్స్ అధిపతి బి. ఎన్. సర్కార్ గోష్ఠికి అధ్యక్షులు. పృథ్వీరాజ్ కపూర్, దేవికారాణి రోరిక్ జాయింట్ డైరెక్టర్లు. బొంబాయినుండి శాంతారాం, దుర్గాఖోటే, కిశోర్ సాహూ, కె. ఎ. అబ్బాస్, అనిల్ బిశ్వాస్, రాజ్ కపూర్, నర్గిస్, దిలీప్‌కుమార్, బిమల్ రాయ్ మున్నగువారు, మద్రాసునుండి ఎస్. ఎస్. వాసన్, ఆర్. ఎమ్. శేషాద్రి, ఎన్. సి. సెన్ గుప్త, మార్కస్ బార్ట్లే, బి. ఎన్. రెడ్డి, కె. రామనాథ్ మున్నగువారు పాల్గొంటారు.

## జెమినీవారి కొత్త హిందీ చిత్రం

జెమినీవారు "ఇన్సానియత్" అనే మరొక హిందీ చిత్రం తీయ సంకల్పించారు. ఈ చిత్రంకూడా భారీ బడ్జెట్‌తో, బొంబాయి, మద్రాసులలోని ప్రముఖ తారలతో తయారవుతుందట. మానవత్వమే అన్నిటికంటె గొప్పదని నమ్మిన ఒక గ్రామపు ప్రజలకు, హింసావాదియైన ఒక

# ప్రేక్షకుల అభిప్రాయాలు

## "విప్రనారాయణ"

విప్రనారాయణ చిత్రము చాలా బాగుంది. దేవదేవిగా భానుమతి, విప్రనారాయణుడుగా నాగేశ్వరరావు, రంగరాజుగా రేలంగి కడుసమర్థతతో తమ తమ ప్రాతలను అర్థముచేసుకొని చక్కగా నటించి ప్రేక్షకులను ముగ్ధులుచేశారు. చిత్రానికి రాజేశ్వరరావుగారి సంగీతము జీవంపోసింది. ఫొటోగ్రఫీ, సౌండు, సెట్టింగులు సంతృప్తికరముగా వున్నాయి. భానుమతి పాడిన పాటలు, నృత్యములు చాలా బాగున్నాయి. ఎ. యమ్. రాజా పాడినపాట్లలో రెండు మాత్రమే బాగున్నాయి.

ఏవో కొద్దిలోపము లున్నప్పటికి మొత్తానికి చిత్రము ప్రేక్షకుల ఆదరాభిమానములు చూరగొనువనుటలో అతిశయోక్తి యేమాత్రములేదు. ఈ చిత్రమును కడుసమర్థతతో నిర్మించి ఆంధ్రప్రజల కందజేసిన భరణీ సంస్థవారికి, ప్రొడ్యూసర్, డైరక్టర్ అయిన రామకృష్ణగారికి నా హృదయపూర్వకాభివందనములు.

కె. ఎస్. కృష్ణమూర్తి
—రాజమండ్రి.

* * *

"విప్రనారాయణ" చిత్రం బాగుంది. విప్రనారాయణుడుగా నాగేశ్వరరావు, దేవదేవిగా భానుమతి అద్భుతంగా నటించారు. రంగరాజుగా రేలంగి చక్కగా నటించాడు. పాటలు మాటలు బాగున్నవి. కథ పాతదైనప్పటికీ కథాగమనంలో యెలాంటి లోటుపాట్లు లేకుండా చిత్రించారు. చిత్రంలో అనవసరమైన ఘట్టాలు గాని, అసభ్య సన్నివేశాలు గాని లేక చక్కని సంగీతముతో యీ చిత్రం మనోరంజకముగా నున్నది.

ఎన్. ఎస్. ఎ. పద్మావతి
—గుంటూరు.

* * *

"విప్రనారాయణ" యీమధ్య విడుదలైన తెలుగు చిత్రాలలో కొంచెము మెరుగనిపిస్తుంది. కథ పురాతనమైనా, పంథా నూతనంగా కనిపిస్తుంది. నాగేశ్వరరావు విప్రనారాయణ పాత్రను బహు సమర్థతతో నిర్వహించాడు. భానుమతి దేవదేవిగా ప్రారంభంలోకంటే విప్రనారాయణుని ఆశ్రయించిన తరువాత బహు చక్కగా నటించింది. రాజేశ్వరరావుగారి సంగీతం భానుమతి, రాజాలపాటల నున్నతస్థాయిలోనికి తీసుకవెళ్ళింది. ముఖ్యముగా నటనలో చెప్పుకోదగ్గవారు, మొదట నాగేశ్వరరావు, తరువాత భానుమతి. రేలంగి. ఋష్యేంద్రమణి తదితరులు సాధారణమే. కథ ఆఖరు సన్నివేశాలలో నిస్సారంగా నడిచింది.

బి. నరసింహారెడ్డి,
—బెంగుళూరు.

* * *

భరణీవారి చిత్రాలలో ప్రథమస్థానాన్ని ఆక్రమించుకొన్న అత్యుత్తమ చిత్రం "విప్రనారాయణ." క్రొత్తపంథాలో నేటి ప్రేక్షకులు ఆశించే అన్ని రసాలను సరసంగా చిత్రించి, కళాత్మకంగా; సంగీతాత్మకంగా నిర్మించిన భరణీ సంస్థను అభినందిస్తున్నాను.

కథాకాలపు వాతావరణాన్ని సహజంగా చిత్రించడానికి తీసుకున్న శ్రద్ధ ప్రశంసనీయమైనది. రంగరాజు పాత్ర ప్రాధాన్యం చిన్నదైనా ఆ పాత్రద్వారా తగిన మోతాదులో హాస్యరసాన్ని అందీయడంవలననే ప్రేక్షకులు అభినందించగలుగుతున్నారు. విప్రనారాయణగా నాగేశ్వరరావు నటనకు సాటిరాగల సహజమైన నటనా ప్రతిభ అరుదు. విప్రనారాయణ పాత్రకు ఒక్క నాగేశ్వరరావే సమర్థుడని నిరూపించుకో గలిగాడు. ప్రథమంలో పౌరాణిక గాథద్వారా పరిచితుడైన ఈయన తరువాత అనేకరకాలైన పాత్రలను పోషించి అఖండఖ్యాతి గార్జించారు. కాని విప్రనారాయణ పాత్రపోషణలో ప్రత్యేకశక్తి సామర్థ్యాల్ని ప్రదర్శించాడు. ఏమైనా నేటి నటులలో నాగేశ్వరరావు ఒక మణిపూస అనక తప్పదు. భానుమతి నాట్యకత్తెగా, దురహంకారిణిగా చివర పరివర్తనపొందిన భక్తురాలుగా ఉన్నతస్థానాన్నందుకొంది. రంగరాజుపాత్ర ద్వారా "రేలంగి" మోతాదైన హాస్యాన్ని అందించి చిత్రవిజయానికి తోడ్పడ్డాడు. "మల్లీశ్వరి"ద్వారా అనన్య ఖ్యాతిగాంచిన శ్రీ రాజేశ్వరరావు మరల తన సర్వశక్తుల్ని "విప్రనారాయణ" చిత్రంలో ధారపోసి సంగీతకళను ఉత్తమస్థానానికి తీసుకురాగలిగారు. సముద్రాలవారు కొన్నిచోట్ల సమాసాలను ప్రయోగించినందువల్ల ప్రేక్షకులు యింటికిపోయి "నిఘంటువులు" తిరగవేయవలసి ఉంటుందనిపించింది పాటలు రసపుష్టితో మధురంగా ఉన్నాయి. చివర రంగస్వామిని స్తుతిస్తూ తన తప్పులను క్షమించి రక్షించమని పాడినపాట ప్రతీ ప్రేక్షకుణ్ణీ ఉద్రూతలూగిస్తుంది. రాజా మధురస్వరం, సముద్రాల పదజాలానికి జీవాన్ని కలుగజేసింది.

కొప్పాక రామకృష్ణారావు చౌదరి
—రాజమండ్రి.

* * *

భానుమతి నటన ప్రశంసనీయం. నాగేశ్వరరావు హృద్యంగా నటించకపోయినా, ఫరవాలే దనిపించాడు. రేలంగి నటించిన పాత్ర అద్భుతంగా వుంది. ఋష్యేంద్రమణి, విమల, శ్రీశివరాం గారలుతగువిధంగా నటించి, చిత్రానికి వన్నె తెచ్చారు. నాట్యాల్లు అంత బాగాలేవేమోననే అనుమానం అక్కడక్కడా కలుగుతోంది. రామకృష్ణగారి దర్శకత్వంలో, ప్రతిభ ద్యోతకమయింది. సెల్వరాజ్ ఛాయా

---

నియంతకు జరిగే సంఘర్షణ, చివరకు ఆ దౌర్జన్యపరుడు మానవప్రేమయొక్క మహత్తును తెలుసుకొని పశ్చాత్తాపపడడం ఈ చిత్రంలోని కథకు సారాంశమని తెలుస్తున్నది.

## "అర్ధాంగి"

బెంగాలీ కథ స్వయంసిద్ధను అనుసరించి రాగిణీవారు నిర్మించిన "అర్ధాంగి" చిత్రం రీరికార్డింగ్ దశలో ఉన్నదని, త్వరలో విడుదల కావచ్చుననీ తెలుస్తోంది. దర్శకుడు పి. పుల్లయ్య; సంగీతం బి.ఎన్.ఆర్.; కళ కె. సుబ్బారావు; ఫొటోగ్రఫీ మాధవ బుల్‌బులే. ఈ చిత్రం కథ ఆంధ్ర 'వారపత్రిక' ద్వారా పాఠకులకు పరిచితమైనదే. ఆ కథను మరికొంత పొడిగించారనీ, మొదట అహంభావంతో ప్రవర్తించిన జమీందారిణి పశ్చాత్తాపపడి సవతికొడుకు, కోడలిపక్షాన చేరి తనకొడుకునకు ఎదురు తిరగడం, ఆమెకుమారుడుకూడా తన వదిన సౌజన్య ప్రభావానికిలోనై పశ్చాత్తాపపడి చివరకు మంచివారికి రావడం మొదలైన కథ చేర్చబడిందనీ తెలుస్తోంది. పద్మ (నవలలో చండి) గా సావిత్రి, ఆమె భర్తగా నాగేశ్వరరావు, జమీందారుగా గుమ్మడి, జమీందారిణిగా శాంతకుమారి, ఆమె కుమారుడుగా జగ్గయ్య, ఇంకా దొరస్వామి, డా॥ శివరామకృష్ణయ్య, సురభిబాలసరస్వతి, సంగీత దర్శకుడు బి. ఎన్. ఆర్. మున్నగువారీచిత్రంలో నటిస్తున్నారు. ★



రాగిణివారి "అర్థాంగి" లో కొడుకు అడిగినంతా ఇచ్చి అతని దుండగాలకు తోడ్పడుతున్న జమీందారిణి: జగ్గయ్య, శాంతకుమారి.

## ★ ప్రేక్షకుల అభిప్రాయాలు ★

గ్రహణం, రాజేశ్వరరావుగారి వీనుల విందగు కర్ణాటకసంగీతం, చిత్రానికి ఎంతో సహాయపడ్డా యనడంలో, అతిశయోక్తి లేదు.

'నల్లశ్రీ'—కావలి.

★

### "పల్లెపడుచు"

బోళ్ల సుబ్బారావుగారి దర్శకత్వాన తయారైన ఈ చిత్రం ప్రజల ఆదరాభిమానములు చూరగొంటున్నదనటంలో ఆశ్చర్యములేదు. చిత్రంలో అచటచట కొన్ని లోపాలున్నా అవి ప్రేక్షకులకు అసంతృప్తి కలిగించలేదు.

చిత్రం నిడివి కొండవీటి చాంతాడులాగున్నప్పటికీ ప్రేక్షకులకు విసుగు లేకుండా వున్నది. మాటలు పాటలకన్న బాగున్నయ్. సంగీతము చెప్పుకోదగదిగా లేదు. చిత్రంమొత్తంలో ఏవో కొన్ని పాటల స్టయిల్సు బాగున్నవి.

కథ సాంఘిక చిత్రము అయినను అచటచట కొన్ని సీనులు సాంఘికంగా వున్నట్లు కన్పించలేదు. విలన్‌గా ముక్కామల ఉత్తమంగా నిర్వహించాడు.

జమీందారిణి మాటలలో వుండే అధికారము, ఆమె నవ్వులో వుండే నిర్లక్ష్యము ప్రతి ప్రేక్షకహృదయాన్ని కదిలించింది.

నటీనటుల్లో అమర్‌నాథ్, రామశర్మ, చలం వగైరాలు వారివారి పాత్రల నర్థం చేసుకుని వాటికి న్యాయం చేకూర్చారనే చెప్పాలి. పేకేటి శివరాం పాత్ర కేవలం వినోదంకోసం ఏర్పడినట్లుంది కాని కథకు సంబంధించినట్లు కన్పించడంలేదు.

జె. యల్. భారతి—తెనాలి.

* * *

చిత్రం నిడివి కొంత తగ్గించినా కథకు ఏమాత్రం ప్రమాదం లేదు. అనవసరమైన సీన్లు చాల వున్నవి. బోళ్ళ సుబ్బారావుగారు కొంతవరకు ముందంజవేశారు. చిత్రం పేరు "పల్లెపడుచు" అని ఎందుకు పెట్టారో డైరెక్టరుగారికే తెలియాలి. జమిందారుగారి దాసి చివరకు దుండగులచే కొట్టబడి చచ్చిపోయే ముందు పోలీసులను రమ్మనమని కబురు చెప్పింది. కాని పోలీసులు రాలేదు. పోలీసు ఇన్స్పెక్టరుగా రామశర్మ, వైద్యుడుగా వంగర బాగా నటించారు. ముక్కామల నటన ఒక మోస్తరుగా వుంది. వరలక్ష్మి నటనలో నూతన ప్రతిభ కనిపిస్తుంది. చలంయొక్క పాత్ర అనవసరం. సీతారాం సి. ఐ. డి. గా బాగున్నాడు.

బుర్రా ముకుందకృష్ణమూర్తి
—వేటపాలెం.

★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras

